శ్రీ

# సతీపతిహితోపదేశము.

ఇది

ముముక్షుజనంబుల కాత్మజ్ఞానం బతి
సులభంబుగా దెలియబడునట్లు
నరసాపురం తాలూకా ఆచంటపురనివా
సుండగు

గవరాజు సూర్యనారాయణ శర్మచే

రచియింపఁబడినది.

మొదటికూర్పు 1000

కాకినాడ:

శ్రీ సరస్వతీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడి గ్రంథకర్తచే
ప్రకటింపఁబడెను.

వెల రు 0-2-0.

1911.

# పీఠిక.



కలియుగము పుట్టి అయిదువేల సంవత్సరములై యిప్పుడు రెండవ అయిదువేల కాలచక్రము ప్రారంభమైనది. ప్రథమ ఐదువేల కాలచక్రమందు చతుర్యుగ ధర్మములు నడచుచున్నవి. అనగా లోకంబున ధర్మము క్షీణించినపుడు పుణ్యాత్ములవతరించి ధర్మమును స్థాపించి, లోకమునుద్ధరింతురు. కలియుగాదిని కృతయుగధర్మము నడపబడినది. అప్పటినుంచి క్రమక్రమముగ ధర్మము క్షీణించి, కలిమాయ వ్యాపించి జీవులు స్వలాభపరులై పాపపూరితులై యున్నారు. ఇప్పుడు మొదటి రెండు కాలచక్రములకు సంధి కాలము. ధర్మము వృద్ధి కావలసిన కాలము. అనగా లోకంబున నుత్తమజీవులైన మానవులు, ఉత్తమ ధర్మములైన భక్తి, జ్ఞాన, వైరాగ్యంబుల నభ్యసించి జీవన్ముక్తిని పొందుటకు అదును కాలము. గ్రహణకాలము వంటిది గనుక యిట్టి పుణ్యకాలమున స్త్రీ పురుషులకు విధికృతములైన విహితధర్మములను దెలియజేయుటకు సతీపతి హితోపదేశమను ఈ మోక్షగ్రంథము దివ్యదర్శులగు మహాఋషులవలన కలియుగంబున కల్పవృక్ష

మువలె ననుభవించు చున్నది. గనుక లోకంబున సతీపతు లందరును నీ హితోపదేశమును గ్రహించి పార్వతీ పరమేశ్వరులవలె పరమధర్మ ప్రవర్తను లగుదురుగాక.

ఇట్లు,

బ్రహ్మవిద్యా ప్రబోధకుడు,



గవర్రాజు సూర్యనారాయణశర్మ,

నరసాపురం తాలూకా, అనంతపురం.





శ్రీ ర స్తు

శ్రీగురుభ్యోనమః

# సతీపతిహితోపదేశము.

శ్లో॥ ప్రకృతిః పురుషశ్చైవ। ప్రాంచౌ జాయాపతీ స్వయం।జగతః పితరౌ వందే। పార్వతీపరమేశ్వరౌ॥

(వచనకావ్యము.)

# అపాయము లేని యుపాయము.

## సతీపతులకు మంచిసదుపాయము.

---

ఇమ్మహైంద్రజాలిక మాయాకల్పిత ప్రపంచంబునందు సృజియింపంబడిన జీవరాసులలో మానుషజన్మ సర్వోత్తమమైనదనియు ఇట్టి మానవజాతికి యుక్తాయుక్తవివేకము. సహజధర్మమై యుండుటవలన తక్కిన జంతువుల యందెంత ప్రజ్ఞావిశేషముండినను జ్ఞానశక్తిగల నరజన్మమొక్కటియే సకలజన్మంబులలోను దుర్లభమైనదనియు సర్వత్రా తెలియబడిన విషయమే అయ్యున్నది.

ఇట్టి మానవజన్మ లభించినప్పటికి క్షణమాత్రములో నశించునదిన్ని సకలదుఃఖములకు మూలమైనదిన్ని యైనందున జననమరణదుఃఖముకంటె అధికమైన దుఃఖమున్నూ జీవన్ముక్తి

సుఖముకంటె అధికమైన సుఖమున్నూ యే లోకమునందు లేదనిన్ని భగవంతుడు మనకీమానవ జన్మమిచ్చినందుకు తన్నుతానెరిగి తరించుటకంటె ధర్మమెద్దియును కాదనిన్ని సామాన్యముగా నందరికిని దెలియబడుచున్న యంశమేఅయ్యున్నది.

ఇట్లుపరమధర్మంబునకు తగిన జన్మంబును జన్మ సాఫల్యంబునకు తగిన వివేకంబును మానవులకు లభించియుండిన్ని అవివేకజంతువులవలె అధమగతిని పొందుచున్న విషయము మాత్రము సర్వత్రా తెలియబడుట లేదు. ఎందుచేతననగా "ఇంద్రజాలమిదంవిశ్వం। విష్ణుమాయా సమన్వితం" అనునట్లు లోకంబున మాయామానుష దేహధారులైన జీవులకు అవివేకము అశ్రద్ధ యను రెండు ప్రతిబంధములు కలిగి యుండును. అందు అవివేకము పిశాచము వంటి

దిన్ని, అశ్రద్ధ పెనుభూతము వంటిదన్ని అగు టచే పిశాచము విడిచిపెట్టినను పెనుభూతము మాత్రము విడచి పెట్టునదిగాదు.

ఏలననగా, లోకంబున మానవులు తాముజేయవలసిన ప్రతికార్యమందును తమవివేకము నుపయోగించి శ్రద్ధను వహించి దైవమందు భారముంచి పనిచేసికొనుట విధియైయుండగా లోకంబున సతీపతులు తాముచేయవలసిన కార్యమందు వివేకము నుపయోగించనేరక తమ యిచ్ఛ వచ్చినట్లు చేయుటయు అట్లొనర్చిన కార్యముచెడుటయు, చెడినవెనుక మన మేలయిట్లుజేసితిమని చింతించుటయు మొదటికార్యమట్లు చెడిపోయిన మరుచటికార్యమందైనను తమవివేకము నుపయోగించక మునుటివలెనే తమమనసువచ్చినట్లు జేయుచు యిట్లెన్నికార్యములు చెడిపోయినను యెంతకాలమునకైనను ఇదితమయవివేకమని తమకుతోచనీయక మనుజుల వివేక

యుక్తాయుక్త వివేకము

శక్తిని మటుమాయము జేయుచున్న [illegible] కంటె వేరొక పిశాచ మొక్కడనున్నది.

ఇదియిట్లుండగా రెండవదియగు పెనుభూత మేమి చేయుచున్నదనిన మానవులు కార్యమందు వివేకము నుపయోగించి కార్యము జేయబూనిన ఆ కార్యము నప్పుడు జేయనీయక మరియొకప్పుడు జేయవచ్చుననియు, తాము జేయవలసిన కార్యము మరియొకరివలన జేయించుకొనవచ్చునని యు, ఆతరుణమందు ఆవ్యక్తిని మరిపించి కార్యము చెడగొట్టుచు అట్లెన్ని కార్యములు చెడుచుండినను తమ శ్రద్ధాశక్తిని తమ కార్యమునం దుపయోగించనీయక సోమరితనము బుట్టించి కార్యము నశింపజేయుచున్న ఆశ్రద్ధకంటె వేరొక పెనుభూత మొక్కడనున్నది. మొదటి యవివేకమనునది బుద్ధిమాంద్యముగనుక వివేకముచే సులభముగా తొలగింపవచ్చును గాని రెండవ అశ్రద్ధ

యనునది చిన్ననాటనుండియు పెంచుకొనియు
న్న సోమరితనముగనుక దీనిని దేహమునుండి
సులభముగా తొలగింప శక్యముగాదు. ఈమా
యాగ్రహంబులు రెండును మానవులననుసరించి
విడువకుండుట వలన లోకంబున సతీపతులకు
మతితెలియక, సుతిగలియక, దుక్కి మెద్దు యొం
డలొనికిని దున్నపోతు నీడలొనికిని లాగుచున్న
ట్లు యువతి చిత్తవృత్తిని వారు పరివర్తించుటవల
న సతీపతులు సంసారము చేయుచుండినను దే
హసంయోగము మాత్రమెగాని మనస్సంయో
గములేనందున వకరియందొకరికి ప్రేమానురా
గంబులు జనింపక, విముఖులై భర్తకు పరస్త్రీల
యందును, భార్యకు పరపురుషుల యందును,
మోహముజనించుటయు, అందువలన సతీపతులు
విచ్చలవిడిగా వ్యభిచరించుటయును లేక భార్య
పతివ్రతయైన భర్తద్వేషించి బాధించుటయు
భర్తబ్రహ్మజ్ఞుడైన భార్యద్వేషించి వేధించుట

యు యిట్లనేకవిధంబుల అన్యోన్యస్నేహంబులు ప్రకోపించి మొదటి పాణిగ్రహణ మహాత్మ్యవము తుదకు భార్యభర్తల ప్రాణత్యాగమహాత్మ్యపముగా సిద్ధించుటవలన యీదుష్టదాంపత్యమెంతటి నష్టంబగునో యని యొకరిమరణంబున కొకరు మృత్యుదేవతను ప్రార్థించుచు, తుదకు భార్యవలన బాధలధికమైన భర్తవియోగముజెందుటయు, భర్తవలన బాధలధికమైన భార్యవియోగము నొందుటయు, సంభవించుచున్నది. కాబట్టి లోకంబున సతీపతులకు అవివేకము, అశ్రద్ధయును దుష్టగ్రహంబులు రెండును యిహపరలోక సుఖంబులకు ప్రతిబంధంబులని యిందుమూలముగా స్పష్టమగుచున్నది. మఱియు—

శ్లో॥ దుర్లభోమానుషోదేహో। దేహినాం
క్షణభంగురః। తత్రాపిదుర్లభంమన్యే।
వైకుంఠప్రియదర్శనః॥

అను న్యాయంబున మానవుడు జన్మమృత్యుభ యంబు గలిగినప్పుడు గాని విరక్తింజెందడు. అ ట్లు దృఢవిరక్తిని జెందినప్పుడు గాని జీవన్ముక్తిని గోరడు. ఇట్లు నిత్యానిత్య వివేకమువలన జీవున కు మోక్షేచ్ఛ జనించినప్పుడు ఆవరణశక్తియైన మాయ విజృంభించి లోకవాసనలను వదలనీ యక మనకు పూర్వపుణ్యమున్నయడల మోక్ష మురావలెను గాని లేనియడల మోక్షమెట్లువ చ్చును. ఆమోక్షమునకు దైవయత్నముండవలె నుగాని మానుషయత్న మేమిప్రయోజనము. దైవసంకల్పము లేకున్న మనసంకల్ప మేమిజే యును. అని యిట్లసంభావనాది మూఢవృత్తులు పుట్టించి ముందుదారికి ముండ్లుకప్పినట్లు అప్పటి అత్యాసక్తచిత్తమును అన్యాయత్తముజేసి నిత్యా నిత్య వివేకమును నిర్మూలముజేసి మానవుల మ నంబులను మరియొకదారిని మరలించునది అవి వేక పిశాచమూ? అతని పురాకృతకర్మమా? అని

శంకించిన మనుజుఁడు స్వకార్య మందు స్వప్రయత్నము మాని దైవయత్నముచే లభించుననుట తన యవివేకమునఁబడునే గాని పురాకృత మనఁబడ నేరదు.

ఈయావరణశక్తి యిట్లుండఁగా నిత్యానిత్య వివేకమువలన మానవుఁడు అత్యాతుర ముముక్షుండై మహత్తరమైన మానుషజన్మమందే మోక్షము సాధింపకుండిన మహిమ జన్మమెత్తినపుడు మోక్షమెట్లు సాధింప వచ్చును. అని విమర్శించి యీజన్మమందెట్లయినను మోక్షమును తప్పక సాధింపవలెనని నిశ్చయించి సత్కర్మానుష్ఠానము, సత్సాంగత్యము, సద్గురుసేవ సగుణోపాసన మొదలగు సత్కార్యముల నవలంబించిన సమయంబున విక్షేపశక్తి యైన అవిద్య వెంబడించి దేహవాసనలను విడువనీయక దేవుఁడెక్కడ, జీవుఁడెక్కడ, బంధమెక్కడ, మోక్షమెక్కడ, స్వర్గమెక్కడ, నరకమెక్కడ,

మహామహులైన దేవతులే మోక్షముకొఱకు తల్ల
క్రిందుల పడుచుండగా మనుష్యమాత్రుల కెట్లు
వచ్చును. లేనిపోనిచిక్కులు మన కెందుకు. మన
సాటివారందరును జన్మమే సుఖమని తలచుచుం
డగా జన్మరహితమైన మోక్షమును మన మేల
కోరవలెను. ఇదివఱకున్నట్లుండక మన మెందుకు
కష్టపడవలెను. దేముడిచ్చినమట్టుకు అనుభవిం
చి పోవుటయే మంచిది. అనియిట్లు విపరీతభావ
న పుట్టించి సత్కార్యములయందలక్ష్యము కలి
పించి ముందరికాళ్లకు బంధము వేసి యిట్లు తన శ్ర
ద్ధాసక్తుల సంతరింపజేసి మహాముముక్షువులైన మా
నవులను మృత్యువునోట వేయించునది అశ్రద్ధయ
ను పెనుభూతమా? వారలకర్మసూత్రమా? అని
శంకించిన మానవుడు తనస్వకార్యమును శ్రద్ధ
తో జేసికొనక సోమరియై స్వకార్యమును విడి
చిపెట్టుట అతని యశ్రద్ధ యనబడునే గాని కర్మ
సూత్రమనబడ నేరదు. అందువలన ఈ రెండు

గ్రహంబులును పరలోక సుఖమునకు ప్రతిబంధ ములని స్పష్టమగుచున్నది.

కాబట్టి లోకంబున సతీపతులగు మానవులు అవివేకము, అశ్రద్ధ యను నీ రెండు గ్రహంబుల ను తొలగించుటకు జాగరూకులై శ్రద్ధాసక్తుల తో యత్నించవలెను.

ఎట్లనగా లోకంబున సతీపతులు యింతట నుంచి తాము జేయవలసిన ప్రతికార్యములోను వివేకమును గురువుగా నిల్పుకుని దాని సాధక బాధకములను రెండు, మూడు మార్లు విమ ర్శించిన అందలి యధార్థము బయలుపడు చుండును. అట్లు విమర్శింపబడిన కార్యమునం దు శ్రద్ధయను దైవశక్తిని స్థాపించి నేనొనర్చు మానుషయత్నము దైవసహాయతవలన సఫలం బగుగాక- అని త్రికరణయుక్తముగా నిశ్చయించి అత్యుత్సాహముతో నాకార్యము నారంభించ వలయును.

ఈప్రకారము ప్రతికార్యమునందు గురువు దైవము అను రెండుమంత్రములను జపించుచు సువివేకము, సుశ్రద్ధ యను రెండుసాధనముల నభ్యసించినయెడల అవివేకము, అశ్రద్ధ అను నీ రెండుగ్రహంబులును మహామంత్రప్రయోగంబున మారణమైపోవును. గనుక యిదియే మానవులకు అపాయములేని యుపాయము. ఇంతకంటె సదుపాయమెక్కడను లేదు. ఇట్టి యుపాయము గ్రహించిన సతీపతులు పార్వతీపరమేశ్వరులవలె పరిశుద్ధాత్ములై దుఃఖరూపమైన నరకమును తప్పించుకుని స్వర్గసుఖ మనుభవింతురుగాక.

## నిత్యానిత్యవివేకము.

నిత్యానిత్య వివేకమనగా “ బ్రహ్మసత్యం జగన్మిథ్యా । జీవోబ్రహ్మైవ కేవలం ” అనునట్లు ఆత్మ నిత్యమనియు దేహ మనిత్య

మనియు గ్రహించునది. ప్ర॥ ఆత్మ అనగా యెట్టిది? దేహమనగా యెటువంటిది? ఉ॥ పరబ్రహ్మముయొక్క అంశము ఆత్మయున్ను మాయయొక్క అంశము దేహమున్ను అయ్యున్నవి. ప్ర॥ పరబ్రహ్మమనగా యెట్టివాడు? మాయ అనగా యెటువంటిది? ఉ॥ అకల్పిత స్వయంజ్యోతియే పరబ్రహ్మ మనబడును. ఆ పరబ్రహ్మశక్తియైన మూలప్రకృతియె మాయ అనబడును. ప్ర॥ ఈదేహాది ప్రపంచ మెవరివలన సృజింపబడుచున్నది? ఉ॥ ఆమాయా బ్రహ్మములే ప్రకృతిపురుషులై జీవేశ్వర జగత్తులను సృజియించుచున్నారు. కాబట్టి లోకంబునసత్పతులు తమయందున్న ప్రకృతిపురుష లక్షణములను గ్రహించునదియే నిత్యానిత్య వివేకమని చెప్పబడుచున్నది.

# ప్రకృతిపురుషవివేకము.



“ శ్లో॥ ప్రకృతిం పురుషంచైవ । విద్ధ్యనాదీ ఉభావపి ” అనునట్లు ప్రకృతిపురుషులనగా జగత్కారణకర్తలైన ప్రాచీనదంపతు లనబడుదురు. ఆప్రకృతి పురుషుల సమ్మేళనవలన కల్పింపంబడిన జగన్నాటకము ఇంద్రజాలమని, మహేంద్రజాలమని రెండువిధములుగా వ్యవహరింపబడుచున్నది.

అదియెట్లనగా శ్లో॥ ఏతస్మాత్కిమివేంద్రజాల మపరం । యద్గర్భవాసేస్థితం । రేతశ్చేతతి హస్తమస్తక ।పద ప్రోద్భూత నానాంకురం । పర్యాయేణ శిశుత్వ యౌవన । జరావేషైరనేకైర్వృతం । పశ్యత్యత్తి శృణోతి జిఘ్రతి ।యుత్థాగచ్ఛ త్తథాగచ్ఛతి ॥ అనునట్లు.

సర్వజ్ఞుండైన ఈశ్వరుండు తనయొక్క యుపలన పాంచభౌతిక యుక్తంబగు బ్రహ్మాండమనే కార్ఖానాం బను యొకటంకశాల నిర్మించి అందు బంగారు, వెండి, రాగి, మొదలగు ద్రవ్యములను ముద్రించు యంత్రములవలె నర, పశ్వ, పక్ష్యాదిరూపంబులగు స్త్రీ పురుష యంత్రంబులు గల్పించి ఆజీవయంత్రంబులలో ప్రకృతిపురుషుల నే క్షేత్రబీజంబులను స్థాపించి ఆ స్త్రీపురుష సంయోగమువలన అనేక నరయంత్రంబు లుద్భవించునట్లు జగన్నాటకయంత్రమును తనస్వతంత్రముచే నడిపించుచు తానంతరాత్ముండై విలక్షణముగానుండి వినోదించుటవలన ఈశ్వరసృష్టి మహేంద్రజాలమనిన్ని, జీవసృష్టి యింద్రజాలమనిన్ని చెప్పబడుచున్నది.

ఇట్లు ప్రకృతిపురుషనిర్మితంబగు బ్రహ్మాండంబునందు « క్షేత్రంబు పురుషకారము । ధాత్రీశ్వర బీజమరయ దైవము రెండుగా » అన్నట్లు

ప్రకృతి పురుషాంశజుఁడైన జీవుండు స్వయంకృషిచే భూమిసిదున్నుట, విత్తనములు చల్లుట, నీరుపెట్టుట మొదలగునది మానుషయత్నము గనుక యిదిజీవసృష్టియనిన్ని, ఆభూమియందు వర్షించుట, అందలివిత్తనములు మొలకెత్తుట, ఆ మొలకలు విజృంభించుట ఆవృక్షములందు ఫలబీజములుద్భవించుట మొదలగునది దైవయత్నముగనుక యిది యీశ్వరసృష్టియనిన్ని, యిట్లుఫలించిన ధాన్యాదులను బియ్యముచేయుట ఆబియ్యమును అన్నము వండుట ఆ యన్నమును సతీపతులు భుజించుట, అందువలన సతీపతులు వీర్యవంతులై రమియించుట మొదలగునది జీవతంత్రముగనుక యిది యింద్రజాలమనిన్ని:— ఇట్లుసతీపతులు రతిసల్పుటచే శుక్లశోణితంబులుగలియుట స్త్రీగర్భంబున పిండముద్భవించుట ఆపిండము స్త్రీపురుష రూపంబుగా పరిణమించుట ఆశిశువు స్త్రీయంత్రముసుండిభూపతనంబగుట అప్పుడుజీవించుట లేక

మరణించుట. ఇట్లు జన్మించినయీమాయబొమ్మ క్రమక్రమంబున బాల్య, యవ్వన, కౌమారాది వేషంబులచే నటించుట యథా ప్రకారంబున మాయగా వచ్చినట్లు మాయమైపోవుట మొద లగునది యీశ్వరతంత్రము గనుక యిది మ హైంద్రజాలమనిన్ని యిట్లు జీవేశ్వరులు నలు పుచున్న యీజగన్నాటకము యింద్రజాలకుని గారడివిద్యవలె మిథ్యాభూతమనిన్ని తత్వజ్ఞులు చె లియుచుందురు.

ఇందువలన సతీపతులు గ్రహించవలసినది యేమనగా స్త్రీ పురుష రూపంబులగు తమశరీ రంబులు ప్రకృతిపురుష యుక్తంబయిన జీవయం త్రంబులనిన్ని, అందు సంకల్ప రూపంబయిన ప్రకృతిన్ని సాక్షిరూపంబయిన పురుషుండును క లసి యుండుటవలన యీజీవయంత్రములు చిత్ర విచిత్రముగా నటించుటయు యీప్రకృతి పురుషు ల సంబంధము విడిపోయిన యీజీవ యంత్రము

వడిపోవుటయు కలుగుచున్నది. గనుక సతీప
తులు తమలోనుండు రాజస తామస స్వభావంబు
లగు అవివేకము, అశ్రద్ధ, అతృప్తి, అత్యాశ,
అలక్ష్యము, అసూయత, అస్థిరత, అతికామము,
అతిక్రోధము, అతిలోభము, అతిమోహము, అ
తిమాంద్యము, అతిమత్సరము, జార, చోర,
క్రూర, కపట, వైర, హత్య, హింస, ద్రోహ,
అనృత, అసహనాది, దుర్గుణంబులు ప్రకృతివికా
రంబు లనిన్ని-శుద్ధసత్వ ప్రధానంబగు సత్యము,
జ్ఞానము, శాంతము, ధైర్యము, సంతోషము,
సంతుష్టి, సాహసము, భూతదయ, వితరణము,
విశ్వాసము, విరక్తి, భక్తి, ప్రపత్తి మొదలగు
సద్గుణంబులు పురుషలక్షణంబులనిన్ని గ్రహించి
యీశుద్ధసాత్వీక గుణంబుల నభ్యసించుచు ప్ర
కృతి వికారంబుల నన్నిటిని క్రమక్రమంబున తొ
లగించుకొని నిత్యానిత్య వివేకులై ఆత్మజ్ఞానంబు
న ప్రవర్తింతురుగాక.

# సంకల్ప ప్రభావము.

అక్షరపరబ్రహ్మమగు దేవునిలోనుండి అనంత రూపములగు జీవు లుద్భవించుచున్నారు. చెట్టు యొక్క గుణములు విత్తనమునందణగి యుండున ట్లు యీశ్వరునియొక్క సంకల్పశక్తి జీవులయం దణగియుండును. విత్తనమును మొలవవేసిన దా నిగుణములు బైలుపెడలునట్లు జీవుడు తనశక్తిని వృద్ధిచేసికొనిన దేవునివంటివాడగును.

ఈశ్వరుడు సర్వజ్ఞుడు. సర్వశక్తి గలవాడు. యాదయానిధి తనసంకల్పముచే లోకములను సృజించి రక్షించి లయింప జేయుచుండును. ఈ శ్వరసంకల్పశక్తి మహాద్భుతశక్తి. దానిపరిభావ మెన్నవలవిగాదు. బ్రహ్మాండములను, బ్రహ్మాది దేవతలను, బుట్టించునది యీశ్వర సంకల్పశక్తి యే. అగ్నిగుణములు మిణుగురునం దుండునట్లు

యీశ్వరాంశజుడగు జీవునియందు యీశ్వర సామర్థ్యములు గలవు. జీవునకు యీశ్వరసంకల్ప శక్తివంటి సంకల్పశక్తి గలిగియున్నది. జీవుండును తనసంకల్పశక్తిని సృష్టిస్థితి లయముల కుపయోగింపవచ్చును. అగ్నికున్నంత తేజస్సు మిణుగురునకు లేనట్లు దేవునికున్నంత శక్తి. జీవునకు లేకున్నను మిణుగురును ప్రజ్వలించిన ప్రళయాగ్నియై యగునట్లు జీవునిశక్తి వృద్ధిపరచిన యీశ్వరశక్తియై ప్రకాశించును. అదియెట్లనగా అద్దమునందున్న మలినము బోగొట్టి శుభ్రపరచిన అందున్న దీపము స్వచ్ఛముగా ప్రకాశించునట్లు మనకామక్రోధాదులను వశింపజేసి భగవద్భక్తి, భూతదయ, వీనిని బలపరచికొనిన మనశరీరములు పరిశుద్ధములై మన సంకల్పశక్తి హెచ్చును.

ఈ దేహాస్థుండగు జీవుడు తనసంకల్ప ప్రభావము తానెరుగక అజ్ఞానముచే దానిని దుర్వ్యి

యోగము చేయుచున్నాడు. సంకల్పశక్తియనున
నది యొకసామర్థ్యము. దానిని మంచిపనికిగాని
చెడుపనికిగాని యుపయోగింపవచ్చును. ఒకడు
తన ఖడ్గముచే శత్రువులను వధించిన కీర్తినిజెందు
ను. దానిచే సాధువులను జంపిన పాపమునొం
దును. ఆఖడ్గము వస్తుతఃమంచిదిగాని చెడ్డదిగా
ని కానేరదు. అట్లేజీవుని సంకల్ప శక్తియును
యొకకత్తివంటిది. అదిభోగబంధిసీద్ధ్వ ఆవిరిశక్తి
వలెను విద్యుచ్ఛక్తివలెను ఒకశక్తిగా నున్నది.
మంత్రములచే సిద్ధిని బొందుటయు యితరుల
సంకల్పమును దెలియుటయు నీశక్తిచేతనే. జీవు
డజ్ఞానదశచే తనసంకల్పశక్తిని స్వలాభమునకు
దుర్వినియోగపరచి అనేక నరకబాధ లనుభవిం
చును. నరకానుభవము చక్కగ దెలిసికొనిన
సంకల్పశక్తిచేయు పనులు చక్కగదెలియును.

జీవునియొక్క ప్రతిసంకల్పమునందు కొంత
మనోబలము వ్యయపడుచున్నది. మొనన్ను నిమిష

మాత్రమైనను సంకల్పము లేక నూరకుండే దు. ఒకనిమిషమునకు అనేకసంకల్పములు జ నించును. ఇట్లుజనించు సంకల్పంబులు ఒకదిన మున కెన్నికోట్లు నశించునో, అంతశక్తి హరిం చును. అయితే ఈమనస్సున కింతటిశక్తి యె ట్లు కలుగుచున్నదనగా "ఆత్మచైతన్య మాశ్రి త్య దేహేంద్రియమనోధియః" అనునట్లు అధి ష్ఠానచైతన్యంబగు ఆత్మశక్తియే మనశ్శక్తిగా మారుచున్నది.

ఎట్లనగా ఆత్మశక్తి గొప్ప నదివంటిదిన్ని మనశ్శక్తియొక చెరువువంటిదిన్ని గనుక ఆత్మ శక్తియొక్క ప్రవాహము బుద్ధియను కాల్వగుం డా వచ్చి మనస్సనెడి చెరువునందు పడుచుండు ను. ఆమనోశక్తియొక్క ప్రవాహము యింద్రి యంబులనెడి తూములుగుండా హరించుచున్నది. కాబట్టి జీవుడనెడు కాపు, మనస్సనెడు చెరువున కు, యింద్రియములనెడితూములు బిగించినచెరువు

నిండును. అట్టినీరును వ్యర్థపరచక మంచిపొల మునకు పెట్టి మంచిపైరును పండించ వలెను. ఇట్లనుటచేత జీవుండు తనమనశ్శక్తిని దుష్కర్మ లకు వినియోగము చేయుటమాని యీశ్వరా రాధన మొదలైనసత్కర్మానుష్ఠానముచేయుచు తపోయోగసాధనలచే మనశ్శక్తిని వృద్ధిపరచుకో నిచిత్తస్థైర్యమును పొందవలెనని తాత్పర్యము.

మనస్సునకు మరియొక ధర్మముగలదు. బహుదూరమునసుండిన మన స్నేహితుని మన స్సులో సంకల్పించి తనయెదుటను అద్దమునుంచి తద్ధ్యానదృష్టితో జూచిన ఆయద్దమునందు త నుసంకల్పించినవాని రూప మేర్పడుచున్నది. ఇ టువలెనే మనస్సు యేరూపమును ధ్యానించిన అద్దములో నారూపము కనుపించును. జీవుల యొక్క పూర్వోత్తరజన్మకర్మస్థితులు సంకల్ప ప్రభావమువలన దెలియబడుచున్నవి. మనస్సు నందు జనించిన ప్రతిసంకల్పమును సూక్ష్మాకా

శములో ప్రతిఫలించి ఫొటోగ్రాఫువలె ప్రతిబింబ ము లేర్పడుచున్నవి. ఇదే ప్రకారము ప్రతిజీవు డును నిద్రలేచినది మొదలు ప్రతి నిమిషము లోను సంకల్పించుచున్న మంచిచెడ్డసంకల్పము లను సూక్ష్మాకాశపుస్తకములో వ్రాయబడుచు న్నవి. ఇట్లు సర్వజీవులయొక్క పుణ్యపాపచరి త్రమంతయు ఆకాశపటమున అచ్చుగూర్చినట్లు ముద్రింప బడుచుండును. దీనినే చిత్రగుప్తులు వ్రాసిన లెక్కలని లోకులు జెప్పుకొందురు. ఇ ట్లు సూక్ష్మాకాశమునం దచ్చుపడియున్న చరి త్రమంతయు మరణకాలమందు నిమిషమాత్ర ము జీవునకు దివ్యదృష్టికలిగి తానుచేసిన పుణ్య పాపసంకల్ప రూపము లన్నిటిని సాకల్యముగా జూచుకొని వానిలో తనకు ప్రియమైన రూపము ను చింతించుచు జీవుడు దేహమును విడచిపో వును. కాబట్టి జీవుండు తనజీవితకాలమున భగ వద్భక్తి, భూతదయ మొదలైన వానియందు

వర్తించిన అంత్యకాలమందు ఆవృత్తియే స్ఫురణకు వచ్చుచుండును.

మరియును ఒకని మనస్సునందు దుష్టసంకల్పము గలిగినయెడల యాసంకల్పముచే నొకభూత ముద్భవించును. ఆసంకల్ప పిశాచము అతని ప్రక్కనున్నవాని మనస్సులో ప్రవేశించి, వాని మనస్సు చలింపజేసి దుష్టబుద్ధిని గలిగించును. ఒకనిమనస్సున దొంగబుద్ధి గలిగియున్నయెడల, యాసంకల్పముచే మరియొక సంకల్పపిశాచ ముద్భవించును. ఆపిశాచము మరియొకనిని బట్టిన వాడును దొంగబుద్ధిగలవాడగును. ఇట్లు జార, చోర, సంకల్పపిశాచంబులు లోకంబున వ్యాపించి మశూచి, విశూచి మొదలగు అంటుజాడ్యములవలె ప్రజలను బట్టి బాధించుచుండును. ఇటువలెనే సకలగుణంబులును సహవాసమువలన సంభవించుచున్నవి.

ఒకని దుష్టసంకల్పము మరియొకనికి దుష్ట

బుద్ధిని బుట్టించిన మరల అతనికి సద్బుద్ధి గలిగించు వరకు యతనికి ఋణస్థుడై యాఋణ మెన్నిజన్మములకైనను తానుతీర్చవలసియుండును. దీనికే కర్మమని పేరు. ఇట్టిదుష్కర్మ దుష్టులక పరిమితమై యనేక పిశాచ, రాక్షస, జన్మంబులెత్తించును.

ఇటువలెనే ఒకడు మంచిసంకల్పముగలిగి యీశ్వరధ్యానము చేయుచున్నయడల యాసంకల్పముచే దివ్యతేజఃపుంజమైన మంగళదేవత యుత్పన్నమగును. ఆదేవతమరియొకని హృదయము లో ప్రవేశించి వానికి దైవభక్తి పుట్టించును. అందువలన మరియొక మంగళదేవత జనించును. ఆరెండు దేవతలునుం గూడి యింటి వారిని యిరుగుపొరుగువారిని వ్యాపించి లోకంబున దుష్టసంకల్ప పిశాచబాధను హరింపజేయును. ఇట్లు లోకమున నుపకారము జేయువానికి ఋణగ్రస్థమైయున్న సంచితకర్మరాశి నశించి

ఋణవిముక్తి యగుచున్నది. ఇట్టి ఋణబాధను యీజన్మమందే తీర్చుకొనుటకై తానేసత్కర్మము చేసినను శ్రీకృష్ణార్పణముగా జేయవలయునని శ్రీకృష్ణభగవానులు గీతాశాస్త్రములో బోధించియున్నారు. మనమట్లుచేసిన పుణ్యఫలమును మనఋణస్థులకు పంచిపెట్టి మనఋణమును చెల్లుబెట్టించును. కాబట్టి లోకంబున ప్రతిజీవుడును ముందుగా మనశ్శుద్ధికొరకు యత్నింపవలెను.

మనశ్శుద్ధియనగా లోకంబున దుష్టబుద్ధిగల అశ్వమును అశ్వశిక్షకుడు వశపరచుకొన్నట్లు, ప్రతిమనుష్యుడును చంచలమైన దుష్టమనస్సును ఉపాయముచే వశపరచుకొని సుస్థిరత్వమునకు తేవలెను. ఇతరకాలమందు యేవిషయమును మనస్సు ప్రేమించునో, ధ్యానకాలమందు కూడా యావిషయమందే మనసు పోవుచుండును. కాన విషయానందము నిత్యమైనది కాదని

దానియందలి ప్రేమను బొత్తిగా విడువవలెను. ఇట్లు సదాభ్యాసము జేసినయడల ధ్యానకాల మందు మనస్సు యితరవిషయములకు పోనొల్ల దు. కనుక వైరాగ్యము, భూతదయ, భగవద్భ క్తి, నభ్యసింపవలెను. జీవుండు తన సత్సంకల్ప దుస్సంకల్పములచేతనే స్వర్గ, నరకంబు లనుభవిం చుచున్నాడు.

అదియెట్లనగా జీవునికి స్థూల, సూక్ష్మ, కా రణములని మూడు దేహములున్నవి. వానిలో స్థూలదేహము దృష్టిగోచరమైనది. సూక్ష్మదే హము, సూక్ష్మఅణువులతో నేర్పడి స్థూలదేహ మందంతటను వ్యాపించియున్నది. కారణదేహ ము సూక్ష్మదేహముకన్నను అతి సూక్ష్మాంశ ములతో నేర్పడి స్థూల, సూక్ష్మదేహములయం దు నిండియున్నది. అటువలెనే భూలోకము, భువర్లోకము, సువర్లోకము, వకదానియందొకటి వ్యాపించియుండును. తక్కిన లోకములను

యిటువలెనే యుండును. ఈలోకములకు స్థితిభేద మేగాని స్థలభేదములేదు. భువర్లోకమున నొక భాగమే నరకము. స్థూలదేహము భూలోక తత్వముతోను సూక్ష్మదేహము భువర్లోక, సువ ర్లోక తత్వములతోను యేర్పడినవి. ఇవి దివ్య దృష్టికలవారి కగుపించును. తెల్లగుడ్డను రంగు లు పట్టుకొనునట్లు జీవుని ప్రతిసంకల్పమున్నూ సూక్ష్మదేహమందొక మార్పును గలుగజేయు ను. మరణాంతమున జీవుడు స్థూలమునువిడిచి సూక్ష్మ, కారణ దేహములతో భువర్లోకము ప్రవేశించును. భూలోకమందు తనకు గలిగి యుండు సంకల్పవాసనలతో భూజనుల సూక్ష్మ శరీరములందు బ్రవేశించి తమతమ యిచ్ఛలను తీర్చుకొనుచుండును. సూక్ష్మకారణ దేహము లందు నిండియున్న వాసనలు జీవునివెంబడించి యిట్లు భువర్లోకమున బాధపడుటయే నరకమన బడును. ఆదేహమునకేయాతనాదేహమని పేరు.

# జీవునివాసనలు.

దయానిధియగు యీశ్వరుడు మనపాపకర్మ దుర్వాసనలు నాశముచేసుకొని ఈశ్వర స్వరూపుల మగుటకై యీమానవ శరీరమిచ్చినాడు. ఈస్థూలదేహము భూలోక తత్వముతోను సూక్ష్మ, కారణ దేహములు భువర్లోక, సువర్లోక తత్వములతోను యేర్పడినవి. సువర్లోక ఉత్తమ భాగము అరూపభాగమనియు అధమభాగము రూపభాగమనియుం జెప్పబడును. కారణశరీరము సువర్లోక అరూపభాగపు అణువులచే నేర్పడి జీవన్ముక్తి దశవరకు జీవుని యంటియుండును. సూక్ష్మశరీరము భువర్లోక అణువులచే నేర్పడినపార భువర్లోక శరీరమనిన్ని సువర్లోక

రూపభాగపు అణువులతో నేర్పడినవారి స్వర్గశ
రీరమనిన్ని చెప్పబడును. సువర్లోక శరీరము అ
ప్పుమయ శరీరమనబడును. జీవుడు భూలోకము
న స్థూలము నువదిలి భువర్లోకశరీరము, స్వర్గ
శరీరము, కారణశరీరము, గలిగిసంచరించగలడు.

భూలోకశరీర మనగా స్థూలదేహము.
దీనిలో స్థూల శాశ్వత అణువుండును. ఇది
భూలోకమున సంచరించుటకున్ను కార్యములు
చేయుటకున్ను యేర్పడినది. భువర్లోకశరీర
మనగా దీనిలో స్థూలాకాశ తత్వ అణువుండును
ఇది భువర్లోకమున సంచరించుటకున్ను, పాప
ఫలమనుభవించుటకున్ను యేర్పడినది.

3. సువర్లోకశరీరమనగా దీనిలో సువర్లోక
శాశ్వతఅణువుండును. అమృతయశరీరము యిది
సువలోక రూప భాగమున సంచరించుట
కున్ను, పుణ్యఫల మనుభ వించుటకున్ను
యేర్పడినది.

4. సువర్లోక అరూపభాగము కారణశరీరము. ఇది సువర్లోక అరూపభాగమున వర్తించుటకున్ను పూర్వజన్మ వాసనలకున్ను స్థానమైయ్యున్నది. కారణ శరీరాంతర్గతుండగు జీవుడు స్థూల, సూక్ష్మ శరీరముల బరువుచే భూలోకమునంటి సంచరించుచుండును.. జీవుడు సూక్ష్మకారణ శరీరములతో భువర్లోకము ప్రవేసించి అచ్చట పాపానుభవము తీరగానే భువర్లోక శరీరము పడిపోయి దానియణువులు యాలోకమందు గలియును అటుపిమ్మట జీవుడు స్వర్గమున ప్రవేసించును. అచ్చట పుణ్యాను భవము కాగానే అస్వర్గశరీరము పడిపోవును. పుణ్య, పాప వాసనలు గల కారణశరీరముతో సువర్లోకముచేరి కొంతకాలమచ్చట నివసించి పూర్వపు భూలోక వాసనానుగుణ్యముగా భూలోకమునకు దిగివచ్చును- ఈశాశ్వత అణువులనే దేహబీజము లనిసూత్రభాష్యమందు చెప్పబడియున్నది,

# శాశ్విత అణువులు.

మరణానంతరము స్థూలదేహము దహింపబ డినను స్థూలాకాశ సంబంధమైన యణువొకటి స్థిరముగ నిలచియుండును. ఈయణువు ప్రతి జన్మమందును మారక సూక్ష్మ శరీరమునంటి శాశ్వతము గా జీవునితోనుండును. దీనిని స్థూల శాశ్వత అణువని చెప్పుదురు. ఇది జీవుడు భూలోకమున నున్నప్పుడు స్థూల దేహము నందుండి అనుభవముల నన్నిటినీ గ్రహించుచు ఆవాసనలు తనయందు చేర్చుకొని యుండును. స్థూలము సదా చలించుచు మారుచుండును. సాత్వికాహారములు భక్షించి సత్కార్యములు చేయుచుండిన అట్టి సద్వాసనలున్ను మత్తు వస్తువులు భక్షించి దుష్కార్యములుచేసిన అట్టి దుర్వాసనలున్ను యీఅణువునందు చేరును. చెట్టుయొక్క సకలగుణములు బీజమునందు చేరి

బీజమునందలి గుణములుమరల చెట్టు నకు వ్యాపించు నటుల స్థూల శరీరము ద్వారా పొందుచున్న అనుభవములన్ని శాశ్వతవు అణువునందు చేరును. స్థూలము నశించినను ఆయణువుతోచేరి భువర్లోకము ప్రవేశించి అచ్చట నరకబాధ పొందుచు కొంతకాల ముండును. ఆకాలమున స్థూలశాశ్వత అణువు కుండలోదాచిన విత్తనమువలె యేవిధమైన అనుభవములేక యూరకుండును. భువర్లోకానుభవము ముగియగానే భువర్లోకదేహము నశించి భువర్లోక అణు సముదాయములో చేరును. స్థూల శరీరము వలెనే సూక్ష్మదేహము నశించినను సూక్ష్మ దేహ బీజము నశింపక స్థూల శాశ్వతఅణువువలెనే జీవుని స్థిరముగా నంటియుండును. దీనినే భువర్లోక శాశ్వత అణువందురు. కాబట్టి మనమీ జన్మమున స్వలాభబుద్ధిని దుస్స్వభావమును మాని పరోప

కారమునకును భగవద్భక్తికిని పాటుపడిన భువ ర్లోక శాశ్వతఅణువు నందు దుర్వాసనలుచేరక మంచిదగును. ఇట్లు జీవుడు మూడు శాశ్వత అణువులుకలిగి కారణశరీరాంతర్గతుండై కొంత కాలము సువర్లోక అరూపభాగమున నిద్రించు చుండును. అపుడు శాశ్వతఅణువులు కారణశరీ రమునంటి యూరకుండును. ఇందువలననే కారణశరీరము స్థూలసూక్ష్మవాసనలకు బీజమని చెప్పబడుచున్నది.

మరల కర్మానుసారముగ జీవుడు సువర్లోక రూపభాగమునకు దిగగా సువర్లోక శాశ్వతఅణువుతో చేలనపుట్టి ఆలోక అణుసముదాయములో నుండుపూర్వజన్మ సద్వాసనలగు అణువులతో క్రొత్తశరీర మేర్పడును. అట్టిదేహముతో సత్కార్య ము లధికముగా జేయుగలుగును. కావున మన మీ జన్మమునందు ప్రతి సంకల్పమును ద యాభక్తిసహితంబుగ నుండునట్లు చేయవలెను.

ప్రతిసంకల్పమునకు శాశ్వత అణువులు మారును గాన నొకసంకల్పమైనను చెడుదారికి పోనివ్వ కూడదు. ఇందుకు దేహేంద్రియ మనస్సుల ను చక్కగా స్వాధీన పరుచుకొనవలెను. శరీర ముపరిశుద్ధమగుటకు కల్లు, భంగు, సారాయి, నల్లమందు, మొదలగు తామసాహారాదులను దుష్టకార్యములను, వర్జింపవలెను. వీనినభ్య సించిన ముందుజన్మమునకు కూడా వీనిదుష్టవా సనలు బాధించును. కాబట్టి యీకాలమందు యోగులమనుచు మత్తుపదార్థములను భుజించి బ్రహ్మానందమును బొందెదమని భ్రమించువా రల చెంతజేరగూడదు. లోకమున నిదియే గొప్ప ప్రమాదముగా నున్నది. ఇట్టివారి స్థూలశరీరము అపరిశుద్ధమై చిత్తచాంచల్యము గలిగి పరోపకారము కొరకు దయాస్వరూపులు కాజాలరు. అందువల్లనే ముముక్షువునకు సాత్వి కాహారము, సత్ప్రవర్తనము, విధియని గీతా

శాస్త్రము చెప్పుచున్నది. కాబట్టి బ్రహ్మానంద
ము యింద్రియమనో నిగ్రహముచేతను సద్గురు
ని యనుగ్రహముచేతను పొందదగినదిగాని
మత్తుపదార్థములచే పొం ద ద గి న ది కాదని
యెరుంగునది.

పైనచెప్పిన ప్రకారము జీవుడు సువర్లోకము
ప్రవేశించి సువర్లోకశరీరము నేర్పరుచుకొనిన
పిమ్మట భువర్లోకమున ప్రవేశించును. అచ్చట
భువర్లోక శాశ్వతఅణువునకు చలనపుట్టి దాని
యందున్న అణుసముదాయమును ఆకర్షించుకొ
ని భువర్లోకశరీర మేర్పరుచుకొని అచ్చటనుండి
భూలోకముప్రవేశించును. భూలోకమున జీవుని
స్థూలశాశ్వతఅణువు ఓషధులద్వారా తండ్రిశరీ
రములో చేరి తండ్రిరేతస్సై తల్లిగర్భమున
ప్రవేశించి క్రిమక్రమముగ జన్మ మెత్తును.
ఇట్లు జీవుడు గతించినది మొదలు భువర్లోకము
ప్రవేశించి ఆలోకానుభవము ననుభవించి దానిని

వదలి సువర్లోకము చేరి అలోకానుభవము కాగా అరూపభాగమున నిద్రించి పరల అచ్ఛ టనుండిదిగి క్రమక్రమముగ భువర్లోకశరీరమును భూలోక శరీరమును ఆయా దేవతల సహాయము చే నేర్పరచుకొనును. ఇదిపంచాగ్ని విద్యయందు చెప్పబడినది.

"శ్రు॥ ద్యూవర్జన్యస్యౌషధీపితామాతా" అని ఛాందోగ్యఉపనిషత్తు. ద్యు అనగా స్వర్గము ; పర్జన్యఅనగా భువర్లోకము ; ఓషధీ అనగా ధాన్యము ; పితామాతా అనగా తలిదండ్రిలు. ఈ యైదింటిద్వారా జీవుడు స్థూలప్రపంచము ను చేరును. ఇదిజీవునిరాకపోకలు తెలుపు మార్గము. ఇదిదక్షిణాయనమని, కృష్ణపక్షమా ర్గమని, పితృయానమని, చీకటియని, శాస్త్ర ములు చెప్పుచున్నవి. జీవుడు దేహాభిమానము గలిగి స్వలాభ పరుడై యిహసౌఖ్యమందు యెంతకాలమిచ్ఛయుండునో అంతవరకు యిటు

వలెనే పుట్టుచు, గిట్టుచుండును. దుష్టబుద్ధి అధికము కాగా దుష్ట కుటుంబములందు జన్మించి గతిదెలియక కష్టపడుచుండును.

ఈదుష్టవాసనలు నశింపచేసికొని శాశ్వతత్వమును పొందుమార్గమే నివృత్తిమార్గమనియు, ఉత్తరాయణమనియు, దేవయానమనియు, శుక్లపక్షమనియుం జెప్పబడును. జీవుడు ద్వేషబుద్ధినివిడచి పరోపకారబుద్ధి నభ్యసించిన క్రమక్రమముగ ముక్తిని పొందగలవాడగును. ద్వేషమనగా- రాముడు, కృష్ణుడు అనునిద్దరిలో రాముడు, కృష్ణుని ద్వేషించిన రామునిమనస్సునుండి ద్వేషసంకల్పము బాణమువలె పోయి కృష్ణునిదేహమునకు తాకును. అప్పుడు కృష్ణునకు ద్వేషబుద్ధి ప్రేరేపించును. ఆకారణముచే కృష్ణుడు రామునితిరుగా ద్వేషించును. అప్పుడు కృష్ణుని మనస్సునుండి బయలుదేరిన ద్వేషబాణము రాముని మనస్సునజేరి రెండంతలు

ద్వేషము హెచ్చును. ఇట్లు రామునికి రెండంతలు ద్వేష ముద్రేకముచేసిన ద్వేషబాణము కృష్ణుని మరింత ద్వేషింపజేయును. ఈప్రకారము ఉభయులమధ్యను పరిమితిలేని ద్వేషము ప్రకోపించి ఉభయులు అతిక్రూరులై యొకరినొకరు హింసించుకొని తుదకుభయులును నశింతురు. ఇట్లు మనస్సు ద్వేషమందు వినియోగించుటచే బుద్ధి బలము, ఊహాపోహాలు, స్థిరత్వము మొదలయినవి తగ్గిపోవును. శాంతమునశించిన దేహాపటుత్వము పోవును. ఇట్టిజీవుల కెన్నటికిని సద్గతి లేకపోవును.

## మరణ ధర్మములు.



జీవులు భూలోకమున నుండువారు బ్రతికిన వారనిన్ని భూలోకమును వదలినవారు చచ్చిన వారినిన్ని రెండువిధములు. సామాన్యజనులు

మృతిజెందినపిమ్మట మరలజన్మించుటకు రమారమి 1,500 సంవత్సరములు పట్టునని దివ్యదర్శులు జెప్పుచున్నారు. భూలోకమునకన్న జీవుడు భువరాదిలోకములయందు విశేషకాలముండును అటులనుండుటకు కారణము, ప్రయోజనము, తెలియవలసి యున్నది.

జీవుడు స్థూలశరీరము పడిపోగా తక్కినశరీరములతో భువర్లోకము ప్రవేశించి ఆలోకసంబంధమగు యాతనాశరీరము పోవువరకు భువర్లోకమునే నివశించియుండును. స్థూలదేహము పడిపోగానే పంజరముననున్నపక్షి చెరతప్పించుకుని పారిపోవునట్లు జీవుడు తనకర్మదేహమును వదలి భువర్లోకమున ప్రవేశించును. ఇదియే ఛావన బడును. భువర్లోకములో నొకభాగమే నరకమనబడును. ఇట్టి భువర్లోకము . ప్రవేశించిన జీవుడు భూలోకమందుండు, తెలివితో పుణ్యపాప సంకల్పములు కలవాడైయుండును అయితే

వీనికి స్థూలదేహము లేనందున భువర్లోక దేహముచే స్థూలకార్యములను చేయసాధ్యము కాకున్నను తనసంకల్పశక్తిచే కొత్తప్రాణ మయకోశము నేర్పరుచుకొని స్థూలకార్యముల ను చేయుచుండును. మృతజీవుడు మునుపటివలె నే భూలోకజనులయందు ప్రేమయును ద్వేష మును కలవాడై పరులను ప్రేమించుటయును బాధించుటయును కలదు. ధనమునందు ఆశ గలవారు తాము పూడ్చిపెట్టిన ధనమును ఆశ్రయించి దానినిరక్షించుచు తమయిష్టులకాధనము ను నిద్రలోగాని ఆవేశించిగాని తెలియ చేయు దురు. మృతుడుతన యభీష్టమును భూజనులద్వా రాపొంది సంతోషించుచుండును. దుష్టసంకల్ప ములవలని భువర్లోకమునందు పాపము ననుభవిం చునట్లు పుణ్యసంకల్పము వలన స్వర్గసుఖమునను భవించి సద్బుద్ధిగలవారై జన్మింతురు.

(1) దుర్మార్గుఁడు గతించినతోడనే వాని సంకల్పమువలన పుట్టినపిశాచములు వానినావహించి వానిని పెక్కుబాధలు పెట్టును అదియే నరకానుభవము.

(2) సామాన్య మనుజులు మృతినొందిన భువర్లోకములో కొంతకాలముండి విశేషముగా కష్టములనుభవించరు.

(3) శాస్త్రజ్ఞుడు మృతిజెందిన పిమ్మట భువర్లోకమున విద్యావిచారణ విశేషముగ జేసి ముందుజన్మమున గొప్పవిద్వాంసుడగును.

(4) రాజయోగులు చనిపోయిన భూలోకమునకంటె భువర్లోకమున నెక్కువ పరోపకారము జేయుదురు. నరకమందుండువారికిని పిశాచములై తిరుగువారికిని సద్బోధజేయుదురు. భువర్లోకమున ఆకలి, దప్పి, నిద్ర, అలసట, ఆర్జన, మొదలైనవిలేనందున కాలమంతయు భక్తికిని పరోపకారమునకును వినియోగింప వచ్చును.

భోజనులనేకవిధముల మేలుజేయుదురు. భూలోకమున మనమునిద్రించునపుడు జీవుడు సూక్ష్మదేహముతో బైలుదేరి భువర్లోకమున దిరుగుచుండును. గనుక నిద్రకుపూర్వము దుష్టవృత్తితో నిద్రించిన జీవుడు దుష్టులతోగూడి దుర్వ్యాపారము చేయుచుండును. భక్తితో నిద్రించిన స్వప్నమందు రాజయోగులచే సద్బోధయును, మంత్రోపదేశమును, తత్వప్రసంగమును మనముపొందుదుము. గావున జనులందరు నిద్రకుపూర్వము ఈశ్వరుని, సద్గురుని తప్పక ధ్యానించుచు ప్రతిదినము నిద్రించవలయును.

క్రొత్తదేశమునకు పోవునపుడు ఆదేశస్థితిని ముందు తెలిసికొనవలసి యుండునట్లు మనము భూలోకమునందుండునపుడు భువర్లోక, సువర్లోకములస్థితులనున్ను అచ్చట మృతులు సంచరించు ధర్మములనున్ను ముందుగా దెలిసికొనవలెను. చనిపోయినపిమ్మట మనము యజ్ఞానముచే

భువర్లోకమున జేరి అచ్చట మనోవైకల్యము లేక ధైర్యస్థైర్యములతో భక్తిగలిగి వర్తించవలెను. లేనియెడల జీవుడు కలతనొంది దిగులుపడి పరివర్తనదెలియక బాధపడును. పరులు బోధించునది నమ్మకపోయినను తానుమృతినొందినపిమ్మట తానువినినసంగతులు జ్ఞప్తికిదెచ్చుకొని అప్పుడునిజమనినమ్మి తగినట్లు వర్తించును.

మరణము సమీపించినపుడు సంతోషముతో నుండవలెను. చావుచే మనము నశించుటలేదు. మనమెక్కడికిని పోవుటయును లేదు. ఖైదునుండి విడుదలజెందినవాడు సంతోషముతో స్వదేశము జేరునట్లు భూలోకమునుండి గతించెడు ప్రతిజీవుడును పరమానందముతో దేహమునువిడచి బైలుదేరుచున్నాడని దివ్యదర్శులగుయిన పెద్దలు చెప్పుచున్నారు. కావున చావునకు సంతసించవలెనుగాని దుఃఖించవలవదు. దేశాంతరగమనముచేయువాడు శీతోష్ణబాధలకు, కంబళి,

గొడుగు మొదలగు సాధనములు గొనిపోవునట్లు నరక బాధలను దప్పించుకొనుటకు, సూక్ష్మశరీర మందున్న దుస్సంకల్ప మాలిన్యమును బోగొట్టు కొని మనస్సుస్థిమితమునకు దెచ్చుకొనవలయును. కామక్రోధాదులను నశింపు జేసిన మనోమలి నంబు తగ్గిపోవును. ఇంద్రియంబుల వశపరచు కొని రాగద్వేషాదులను పూర్తిగా విడచిపెట్టిన భువర్లోక దేహంబు మంచి తేజస్సును పొందును. వైరాగ్యంబు, దైవభక్తి, భూతదయ, వీనినిచక్క గా అభ్యసించిన సద్గురునికటాక్షంబు గల్గును. మరియు సూక్ష్మశరీరంబు పవిత్రంబు జేసికొని స్వాధీనమనస్కుడై, దేహాత్మాతీతుడగుటకు తగు యత్నంబులు చేయవలెను. ఇట్టివాడు చనిపోయిన భువర్లోకమందు పాపజీవులవలన బాధింపబడడు. ఇతని తేజస్సు ఆలోకవాసులను సద్బుద్ధులను జేయును. ఈభక్తుడు ఆలోకమందు స్వతంత్రుడై యేమాయలకునులోబడక త్వరలో మెట్టుమెట్టు యెక్కి కారణగురు దర్శనంబువలన బ్రహ్మజ్ఞానంబునుపొంది పరిపూర్ణుడు కాగలడు.

# నరకబాధలు.

భూలోకంబున సంకెళ్లువేయబడి ఖైదులోనుండి చనిపోయినవాడు భువర్లోకమందుకూడా సంకెళ్లతో బాధపడుచుండును. ఎందుచేతననగా జీవునకు స్థూలదేహము విడచినవెనుక, శరీరముపోయినదనే జ్ఞానముండదుగనుక తాను మునుపటివలెనే భూలోకమందు ఖైదులోనున్నట్లు భ్రమించును. కుమ్మరవాడు తనసంకల్పముచే మట్టితో ప్రతిమను జేయునట్లు, మృతజీవుడు తనసంకల్పముచే సూక్ష్మఅణువులతో నొకరూపమును సృష్టించుచున్నాడు. గాని యారూపములేర్పడునప్పుడు అవితనసంకల్పముచే నేర్పడినవను జ్ఞానముండదు. అట్టిజీవుని దివ్యజ్ఞానులు చూచి నీవుభూలోకమున మృతిజెంది యిపుడుభువర్లోకమందు సూక్ష్మదేహముతో నున్నావు. నీవు పూర్వవాసనచే ఖైదులోనున్నట్లు భావించుటచే

నీసంకల్పముచేతనే నీకుసంకెళ్ళు యేర్పడినవి. గనుక నీకీబాధ తొలుగుటకై యిప్పటినుంచి నీవుస్థిరముగా నాకుస్థూలశరీరము పోయినదని భావించిన నీకీబాధతొలుగునని బోధింతురు. వాడట్లు ఖయిదుతొలగిపోవలెనని ప్రార్థింపగా వానిబాధ తొలగిపోవును. ఇటులజీవుడు అప్పు డప్పుడు నరకబాధనుపొందుచువిడువబడుచున్నా డు. ఇందువల్ల సంకల్పమహిమ యెంతయును స్ప ష్టపడుచున్నది. గనుక తనసంకల్పశక్తిని జ్ఞానము తోను ఏకాగ్రచిత్తముతోను మనశ్శుద్ధికొర కుపయోగించి రాజయోగానుష్ఠానములను సా ధించి తానుపరిశుద్ధుడనని సంకల్పించుచు కర్మ బంధనాశము చేసుకుని పరిశుద్ధులై యుండ వలెను. ఇట్లునిస్సంకల్పభావముచే దేహత్యాగము చేసినవారికి పితృక్రియలు లేకపోయినను నరక బాధలు కలుగనేరవు. సన్యాసికిని జ్ఞానికిని పితృ క్రియలనావశ్యకములని చెప్పబడినకారణమది యే

కావున జీవుడు నరకమునకున్ను స్వర్గమున కున్ను తనసంకల్పమే కారణమని ముందు నరక బాధను తొలగించుకొనవలెను. గనుకసంకల్ప ప్రభావమును చక్కగా తెలిసికొని మనసంకల్ప శక్తిని వ్యర్థముచేయక సత్కార్యముల కుపయో గింపుచు అభ్యాసవైరాగ్యవిధులచే యింద్రియము లను మనస్సును స్థిరపరచి పరిశుద్ధసంకల్పము కలిగి భక్తి, శ్రద్ధ, భూతదయ, వృద్ధిచేయవలెను.



# భగవద్భక్తి



భగవద్భక్తి యనగా శివకేశవుల కిద్దరికిని య భేదముగా అన్వయించు విషయముగాని అన్య ముగాదు. శివకేశవులనామములు రెండును తుద కు పరబ్రహ్మమునే సూచింపుచున్నవి. శ్రీమహా విష్ణు పరమదయానిధి అపరమపురుషుడు జీవ

కోటిని పరిపూర్ణులను జేయుటకై లోకంబున రామకృష్ణాద్యవతారంబులెత్తి జీవులను దుష్టదేహములనుండి తొలగించి క్రమక్రమముగ పరిశుద్ధులను చేయుచుండును. సాధురక్షణ దుష్టశిక్షణ ధర్మస్థాపనచేయుటయే అతనిపని. దుష్టులను శిక్షించుటవారలయందనుగ్రహముచేతనేగాని ఆగ్రహముచేతకాదు. విష్ణువేదయ, దయయే విష్ణువు. యీమహానుభావుని రూపమంతయు చక్కెరబొమ్మవలె దయతో నిండియుండును. మోక్షాసక్తులగు జీవులు విష్ణునే శేవించవలెను.

అదియెట్లనిన:— లోకంబున సతీపతులు శివకేశవులలో తమకిష్టమైన మూర్తిని తమయిష్టదైవముగానమ్మి ఆయిష్టదేవతయొక్క మూలమంత్రమును గురుమూలముగా గ్రహించి ఆయిష్టదేవతా వ్యరూపమునందు తనచిత్తమును స్థాపించి తన్మూర్తిని ధ్యానింపుచు తన్మంత్రంబును జపింపవలయు. ఇట్లు ప్రతిదినంబును క్షణమాత్ర

ము చెప్పిన పట్టువిడువక నభ్యసించిన కొంత కాలమునకు తమచిత్తము తమకువశమై స్వప్న మందుసహా యిష్టదైవమునే ధ్యానించుచుండును. అట్లునిరంతర ధ్యానపూజన వందనార్చనములచే నారాధింపబడిన యిష్టదైవము తమభక్తికి సంత సించి తమకుస్వప్నమందుగనుపించుటయు తమ తో సంభాషించుటయు తమకెప్పుడు లభించునో అప్పుడు, భక్తియోగమునకు శిద్ధియనబడు చు న్నది. గనుక పాపమూలంబైన నరకబాధలను త ప్పించుకొనుటకు భక్తియోగముకంటెను సులభ మైన యోగము లోకంబున లేదనిన్ని భగవద్భ క్తిలేనివా రెన్నియోగంబు లభ్యసించినను జీవ న్ముక్తిని పొందజాలరనిన్ని గ్రహింతురుగాక.



# ఆత్మజ్ఞానము.

[జగద్గురుండుఅర్జునునకిట్లుపదేశించియున్నాడు.]

ఓయర్జునా! ఆత్మజ్ఞానమును గ్రహింపుము. సకలదేహములయందును ఆత్మయను నత్వదార్థ

మొక్కటియే నిత్యమైయుండునది. గనుక, సకలజంతువులకును నిజరూపము ఆత్మయేగాని దేహముగాదు. నీకును, నాకును అనేక దేహములుఁగలిగి నశించుచున్నను మనముమాత్రము నశించువారముకాము. గనుక దేహత్యాగమునకు దుఃఖించుట యవివేకము. ప్రతిదేహమునకును బాల్య, యవ్వన, కౌమార, వార్ధకావస్థలు ప్రాప్తించుచున్నవిగాని ఆత్మకుయేయవస్థలును గలుగజాలవు. ఆయాఅవస్థలు నశించునప్పుడు ఆత్మనశించుటలేదు. ఇట్లు, ఒక దేహమున కనేకవస్థలు మారుచున్నట్లు, దేహముందుండెడి యాత్మకును మరియొక దేహప్రాప్తి కలుగుచున్నది. ఆత్మజ్ఞాని యిందుకొరకు దుఃఖించడు. ప్రతిదేహికిని యింద్రియ విషయంబులు సంసారదుఃఖంబును గలిగించుచున్నవి. అప్పుడు చిత్తవికారమును పొందక సహించుకొనుటయే జ్ఞానము. అట్టిధైర్యవంతుడే మోక్షమునకు సమర్థుడు.

మరియు, సత్తు, అసత్తు అను రెండువస్తువుల లో ఆత్మసత్తనియు దేహాదిప్రపంచము అసత్తనియు జెప్పబడును. సత్పదార్థ మెప్పటికిని నాశముకాదు. అసత్పదార్థ మెప్పుడును సత్యముకాదు. సత్తనెడి వస్తువే విష్ణువనబడును. యావిష్ణువనెడి బ్రహ్మముచేత సర్వప్రపంచము వ్యాపింపబడియున్నది. ఆపరబ్రహ్మమే యీశరీరములందుండి ఆత్మయనునామముచే వ్యవహరింపబడుచున్నాడు. గనుక, పరబ్రహ్మమగు ఆత్మకు నాశమెపడును కలిగింపజాలదు. ఈ యాత్మ పరులను చంపెడువాడును, పరులచే చంపబడెడువాడునుకాడు. దేహేంద్రియములు లేనివాడు అగుటవలన పుట్టుచావులును వృద్ధిక్షయములును మెప్పటికిని కలుగజాలవని తెలిసికొనుము. ఇట్లు ఆత్మస్వరూపము నెరిగినవాడు తానేబ్రహ్మమై యుండుటవలన అతనిదేహేంద్రియములు చేయుచున్న హింసాదికృత్యములు అతని

నంటజాలవని తెలియుము. ఈకర్మలను నేనుచే సితినని యు ఆఫలములు నాకు లభించుననియు యిట్టితలంపులు జ్ఞానికి కలుగజాలవు. గనుక, సకలదేహముల యందుండెడియాత్మ యెప్పటికి ని నాశము లేనివాడని నీవు తెలిసికొనుము.

ఓయర్జునా, లోకంబున మానవుడు జీర్ణవ స్త్రమును విసర్జించి నూతనవస్త్రమును ధరిం చునట్లు యీదేహమందుండెడి యాత్మయును కర్మవశమువలన పూర్వదేహమునువిడచి క్రొ త్త దేహములను పొందుచుండును. గాని, నిర్వి కారుడైన యాత్మను శస్త్రాస్త్రములు ఛేదింప జాలవు. అగ్నిదహింపజాలదు. జలముతడుపజా లదు. వాయువు శుష్కింపనేరదు. గనుక ఆత్మ నిత్యుడనబడును. నిత్యుడగుటవలన సర్వ వ్యాపియగును. సర్వగతుడగుటవలన స్థిరముగా నుండువాడగును. స్థిరుడగుటవలన నిశ్చలుడనబ డును. మరియునీయాత్మ సర్వేంద్రియములచేతను

యెరుగబడని వాడగుటవలన అవాఙ్మానసగోచరు డనబడును. ఇట్టినిత్యుడైన యాత్మ మాయతో గలసిజనన మరణభ్రాంతిని పొందుచున్నాడు. మరియు అనేకసహస్రములలో నొకడు యీఆత్మను జూచి ఆశ్చర్యపడుచున్నాడు. ఒకానొకడు వినుచుఆశ్చర్యము నొందుచున్నాడు. ఒకానొకడుచెప్పుచుఆశ్చర్యపడుచున్నాడు. ఇట్లుండినను గురూపదిష్ట సంస్కార శ్రద్ధాభక్తులు లేనందున ఆత్మనుఒకడును వాస్తవముగా నెరుగడు.

ఓయర్జునా ఈశ్వరసమర్పణ పూర్వకముగా సత్కర్మలను చేసినయెడల ఈశ్వరానుగ్రహామువలన ఆత్మజ్ఞానమునుపొంది జన్మకర్త ప్రీతి బంధమును తప్పించుకొనగలవు. నిశ్చయబుద్ధిలేనివారికి అనేకకర్మభేదబుద్ధులు గలిగియుండును. అట్టివారిమనస్సు సాంఖ్యమందుగాని యోగమందుగాని నిలువజాలదు. ఆత్మానాత్మవిచారము సాంఖ్యమనబడును. జాగ్రదవస్థయందు బుద్ధి

విషయములకు బోనీయక నిల్పుట యోగమన బడును. యోగమందుండి భగవత్ప్రీతిగా కర్మలను చేయుచుండుము. అట్లుచేయుటచే చిత్తశుద్ధిగలిగి జ్ఞానప్రాప్తియగును. ఇట్లు చేయువారు జ్ఞానులై మోక్షమును పొందుచున్నారు. ఇట్లు కర్మయోగానుష్ఠానముచేత నీబుద్ధి యేకాలము నందు వివేకస్వభావమును పొందునో అప్పుడువై రాగ్యము జనించును. అట్లువైరాగ్యమును పొందిన నీబుద్ధిఆత్మయందునిలచి యెప్పుడునిశ్చలము గానుండునో అప్పుడువివేక ప్రజ్ఞారూపమైన సమాధిని పొందగలవు.

ఓయర్జునా మనస్సునందలి సకలసంకల్ప కామములను బొత్తిగావిడచి పరిశుద్ధాత్మయైన తనయందే తాను తృప్తినిబొంది ఆనందించు వాడు స్థితప్రజ్ఞుడనబడును. ఇతడు రాగభయ క్రోధములను పొందక సుఖదుఃఖములయందు సమత్వముగలిగి యున్నయెడల అప్పుడుముని యని

చెప్పదగును. అట్టిమునికి 'అహంబ్రహ్మాస్మి' యనుజ్ఞానము కలుగగలదు. అట్టివాడుతన యింద్రియములను తాబేలువలె మనస్సులోనికి యిముడ్చుకొని యుండును. మహాబుద్ధిమంతు డైనను సమాధికిముందు యింద్రియములను వశపరచుకొనియెడల వానిని చలింపజేసి క్షోభ పెట్టగలవు. విషయములను దలపోయువానికి విషయములయందే ప్రీతిగలుగును. ఆప్రీతివలన ఆశగలుగును. ఆయాశవలన క్రోధముగలుగును. ఆక్రోధమువలన అవివేకముగలుగును, దానివలన అదివరకుతాను గ్రహించిన జ్ఞానస్మృతి చెడిపోవును. అందువలన బుద్ధినాశమగును. దానిచే పురుషుడు అయోగ్యుడగును. మనస్సును వశపరచుకొన్నవాడు ఆత్మనిష్ఠను పొందగలడు. అందువలన సకలదుఃఖములు నశించుచున్నవి. ఆత్మనిష్ఠుడైనవానిబుద్ధి ఆకాశమువలె సర్వవ్యాపియై ఆత్మసాక్షాత్కారమును పొందుచున్నది.

సమాధినిష్ఠ లేనివానికి ఆత్మ సాక్షాత్కారము కలుగనేరదు. జ్ఞానికి విషయములు సమీపమందున్నను ఆత్మయందు లయించునేగాని మనోవికారము గలిగింపజాలవు. అట్లు యిచ్ఛావిషయములకు వశముగాని ఆత్మవేత్త మోక్షమును పొందుచున్నాడు. మోక్షమునుకోరువాడు సకలకామములను విడువవలెను. మరణకాలమందైనను బ్రహ్మజ్ఞానము గలిగినయెడల మోక్షమును పొందగలడు. ఆత్మబ్రహ్మలకు శబ్దభేదమేగాని అర్థభేదములేదు. గనుక జ్ఞాననిష్ఠులైన మహాత్ములకు బ్రహ్మత్వమే సిద్ధించుచున్నది.

ఓయర్జునా, శాస్త్రమువలన ఆత్మానాత్మల నెరుగునది జ్ఞానమనబడును. ఆత్మానాత్మలకు గల అర్థానుభవము విజ్ఞానమనబడును. ఇట్టి జ్ఞానవిజ్ఞానంబులను రెంటిని కామమునశింపజేయుచున్నది గాన కామమును మహాశత్రువును నీయంతటనీవే విడువుము.

దేహముకంటె యింద్రియములును యింద్రియములకంటె మనస్సును మనస్సుకంటె బుద్ధియును శ్రేష్ఠమైనవి. ఆబుద్ధికి సాక్షియైన వాడు పరమాత్మయనబడును. ఆపరమాత్మను నీవుగా తెలసి ఆత్మయందు చక్కగా నిలచి కామరూపమైన శత్రువును ఆత్మనిష్ఠచే సంహరింపుము. సకలపుణ్యకర్మలును బ్రహ్మజ్ఞానమందు సమాప్తిని బొందుచున్నందున ద్రవ్యయజ్ఞములన్నిటికంటెను జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠమగుచున్నది. గనుక యిట్టిఆత్మజ్ఞానమును అనుభవజ్ఞులైనసద్గురువుల సేవించి సవినయ పూర్వకముగా నడుగుము. నీయందు భక్తిప్రపత్తులు బాగుగా గనుపించినయెడల సద్గురువు లనుగ్రహించి నీయోగ్యతను పరిశీలించి పరబ్రహ్మ సాక్షాత్కార రూపమగు ఆత్మజ్ఞానము నీకుపదేశింపగలరు. అట్టిజ్ఞానముచేత నన్ను దర్శించి నాయందైక్యమును పొందగలవు.

# మనుష్యానందము.

శ్లో॥ వేధాద్వేధా భ్రమంచక్రే। కాంతాసు కనకేషుచ। తాసుతేష్వప్య నాసక్త। స్సాక్షా ద్భర్గోనరాకృతిః॥ అనగా సృష్టికర్తయైన బ్రహ్మదేవుండు కాంతాకనకంబులనే రెండు చక్రంబులచే నీసృష్టియంత్రమును ద్రిప్పుచున్నాడనిన్ని అందువలన మానవులు కాంతాకనకంబులయం దతిమోహులగుచుందురనిన్ని కామరూపంబులగు కాంతాకనకంబులపై మోహము నెవడు వదలుచున్నాడో వాడేపరమేశ్వరుడగుచున్నాడనిన్ని శాస్త్రముచెప్పుచున్నది. గనుక భూలోకంబున జీవుండు మానవదేహధరుండును అందుపురుష శ్రేష్ఠుండును పూర్ణాయుష్మంతుండును అఖండ మండలాధీశ్వరుండును అఖిలైశ్వర్యసంపన్నుండును సకలవిద్యా సద్గుణగరిష్ఠుండునై సకలరాజ్యవైభవ మనుభవించునదే మనుష్యానందమనిన్ని:—

ఇట్టి మనుష్యానందముకంటె స్వర్గలోకంబునంగల దేవగంధర్వాద్యానందములును వానికంటె బ్రహ్మ విష్ణు రుద్రాద్యానందములును వానికంటె పరాశక్తి యానందమును ఒకదానికంటె నొక్కొక్కటి నూరురెట్లధికమై యుండినను యీయానందము లన్నియు మాయాకల్పిత ప్రాపంచిక విషయానుభవము లగుటవలన స్వప్నతుల్యములనియు:— ఇన్నిటికంటెను పరమోత్కృష్టమైన బ్రహ్మానందము మాయాప్రపంచ విలక్షణంబును స్వయంప్రకాశ పరిపూర్ణంబును అద్వితీయాపరోక్ష విదేహకైవల్య పదంబగుటవలన అది నిత్య నిర్విషయ నిజానందమనియు వేదంబులు చెప్పుచున్నవి.

కాబట్టి లోకంబున సతీపతులు స్వర్గమర్త్య లోకంబుల విషయసుఖ మెంతకాల మనుభవించినను "కల్లుదాగిన భల్లూకము వళ్లుమరచి తాను పట్టినపట్టువదలనేరనట్లు" అనుభవించిన

కొలదిని విషయభోగములందలి ఆశను విడువనే
రక అట్టి కామ సంకల్పము చేజనన మరణ ప
ముద్రింబునముమగుటకు కారణమగుచున్నది.
గనుక జగన్మోహినీ యంత్రింబులగు కాంతాక
కంబులేమాయాస్వరూపంబులని గ్రహించి విష
యాసక్తినింతటితో విసర్జించి కామసంకల్పమనే
కంఠపాశమును తప్పించుకొని నిష్కాములై
నిత్యానందసుఖ మనుభవింతురుగాక.

## బ్రహ్మానందము.



శ్రు॥ "ఆనందోబ్రహ్మేతివ్యజానాత్" అన
గా నీసచరాచరభూతంబులన్నియు యేయానం
దమువలన జనించి యేయానందము వలన
జీవించుచున్నవో ఆయానందమే బ్రహ్మస్వరూ
పమని వేదంబులు జెప్పుచున్నవి. గనుక
బ్రహ్మానంద మనగా యెట్లుగలుగు నది?
యాబ్రహ్మానందము ననుభవించువా రెవరు?

అనగా లోకంబున యేజీవుడు మనుష్యానంద మనుభవించువాడో ఆ జీవుడే బ్రహ్మవిద్య నభ్యసించి బ్రహ్మానందము ననుభవించువాడు. అట్లయిన యీజీవునకు బ్రహ్మజ్ఞాన మెట్లు వచ్చును? సద్గురు కటాక్షము వలన బ్రహ్మజ్ఞానమున్ను బ్రహ్మజ్ఞానమువలన జీవన్ముక్తిన్ని గలుగుచున్నది.

జీవన్ముక్తి యనగా నెటువంటిది? గీ॥ పతి యొప్పిన సతియొప్పును, పతిసతులేకమైన పరమ పావనమందున్, సతిపతిన్యాయమె మోక్షం, బతులిత పరమాత్మకైక్య మగురా వేమా॥ అనునట్లు లోకంబున సతీపతులు విషయానంద మనుభవించుటకు ముందుభర్తయైన పురుషుండు స్త్రీసంభోగంబున కిచ్ఛయించుటయు అందుకు తనభార్య అనుమతించుటయు అప్పుడాసతీ పతులు యేకత్వము నొందుటయు నెట్లావశ్య కమో॰ అటువలెనే జీవన్ముక్తి సుఖమనుభవిం

చుటకు ప్రకృతి పురుషులైన జీవపరమాత్మల
కేకత్వము గలుగవలసి యుండును. నిరాకారు
లైన ప్రకృతి పురుషులకు సంయోగ మెట్లు
సంభవించు ననగా బ్రహ్మానంద సుఖం బనుభ
వించుటకు ముందు ప్రత్య గాత్మంబైన
పురుషుండు ముక్తికాంతా సంభోగంబునకు
అత్యాతురచిత్తుండై పరితపించుచుండిన పర
బ్రహ్మ శక్తియైన మూలప్రకృతియును తన
మహేంద్రజాలమును వదలి ముక్తికాంతా
స్వరూపిణియై పతియయిన పరబ్రహ్మముతో
గూడి బ్రహ్మానంద రతిక్రీడా విలాసంబు నలు
పుటకై యత్యుత్సాహంబుతో ననుమతించును.
అప్పుడా ప్రకృతిపురుషు లిరువురునుంగూడియేక
త్వము జెంది బ్రహ్మానంద పరవశత్వంబున
ప్రపంచంబు మరచి నిశ్చేష్టితులై నిర్గుణబ్రహ్మ
మాత్రంబుగానుండి, మరల యథాప్రకారం
బున ప్రకృతిపురుషులు బైలువెడలి సంకల్ప

రూపంబున వ్యవహరింతురు. కావున లోకంబున నతిపతులు బ్రహ్మానంద మనగా యిట్టిజీవ బ్రహ్మైక్యానుభవము వలన సిద్ధించునదిగాని "అహంబ్రహ్మాస్మి" యని మహావాక్యము లుచ్ఛ రించుటచే సంభవించునదిగాదని గ్రహించి సద్గు రు కటాక్షంబువలన యీజీవన్ముక్తి మార్గము నభ్యసించి పరమోత్కృష్టమైన బ్రహ్మానంద సుఖ మనుభవింతురుగాక.

# గురుభక్తి

గీ. గురువనగా పరమాత్ముఁడు । పరగంగా శిష్యుఁడనగ పటుజీవుఁడగుఁ । గురుశిష్య జీవనం పద గురుతరముగ గూర్చు । నతఁడు గురువగు వేమా ॥ అన్నట్లు లోకంబున గురువనగా సర్వ జ్ఞుఁడైన దేవుండును శిష్యుఁడనగా కించిజ్ఞుఁడైన జీవుండును అగుటవలన ముముక్షుండైన జీవుండు బ్రహ్మజ్ఞాన పరిపూర్ణుండైన సద్గురువును సేవించి

బ్రహ్మవిద్యను విధ్యుక్తముగా నభ్యసించి బ్రహ్మానంద సుఖము ననుభవించి బ్రహ్మమై ప్రకాశించువాడే గురువని సేవింపబడుచున్నాడు గాని సద్గురువును శేవింపక బ్రహ్మ విద్యను సాధింపక విద్యాగర్వంబుచే గురుభక్తి విహీనుండై యెన్నిగ్రంథంబులు చదివినను యెన్ని వేదాంతంబు లుపన్యసించినను అట్టివానికి విదేహకైవల్యంబు సిద్ధించనేరదు.

కాబట్టి లోకంబున సతీపతులు బ్రహ్మవిద్య నభ్యసించుటకు బ్రహ్మజ్ఞాన పరిపూర్ణుండైన సద్గురువు నాశ్రయించి అట్టిగురువుకంటె వేరేదైవము లేడని భయభక్తి విశ్వాసములతో శేవించి గురు కటాక్షమును పొంది కృతార్థులగుదురు గాక.



# బ్రహ్మవిద్య.

శ్లో॥ అన్యవిద్యా పరిజ్ఞానం । అవశ్యం నశ్వరంభవేత్ । బ్రహ్మవిద్యా పరిజ్ఞానం । బ్రహ్మప్రాప్తికరంస్థిరం ॥ అనగా లోకంబున మానవులు అరువదినాలుగు విద్యలభ్యసించినను అవియన్నియునుగూడి అమాయికుడైనజీవుని మరింత మాయలోముంచి మృత్యువునోట వేయించునది గాని మాయనుండి తొలగించునవి గావు. బ్రహ్మవిద్య నొక్కటి గ్రహించిన. అతిమాయకుడైనజీవుని మాయనుండి తొలగించి మృత్యువునుదాటించి మోక్షమును పొందించుచున్నది. లోకంబున బ్రహ్మవిద్యయే లేకుండిన ఉత్తమదేహులైన మానవులకు ఉత్తమమోక్షగతి లేక పోవుటయేగాక జీవుడిట్టివాడని, దేవుడిట్టివాడని, కాలుడును దెలియక అధమ జంతువులవలె అధో

గతిని బొందవలసివచ్చును. ఇట్లనేక యుగంబులనుండి యనేక దేవమానవ సంఘుంబులకు శాశ్వత బ్రహ్మత్వము నిచ్చుచున్న బ్రహ్మవిద్యయొక్క ప్రభావమెంతని వర్ణింపవచ్చును. పరమేశ్వర శాసనంబగు బ్రహ్మవిద్యా ప్రభావమిట్లు భూలోకంబున కల్పవృక్షంబువలె వ్యాపించి జననమరణ యుక్తుండైన జీవుని నొక్కదాటున దేవుని బొందించుట కేర్పడియుండగా కలియుగంబున మానవులు బ్రహ్మవిద్యా ప్రభావము నెరుంగక బ్రహ్మవిద్యనగా పెద్దబెడగొండవంటిదని యెంచుకొని దానిపేరుచెప్పిన బ్రహ్మరాక్షసివలె భయపడుచు కొందరభ్యాసము నే మానుకొనుటయు, మరికొందరు బ్రహ్మవిద్య కష్టసాధ్యమనియెంచి మాయాకల్పిత దుర్బోధల ననుసరించి పెక్కువిధములగు పెడత్రోవలను ప్రవర్తించుటచే ఒకరియనుభవ మొకరికి సరిపడక యెవరిమార్గమును వారే నిజమనుకొని

తుదకు నానాత్వమును పొందుచుండుట వలన లోకంబున అసలు బ్రహ్మవిద్యాంతరించి ముముక్షువులకు నిజమైన మోక్షమార్గము దెలియక మోసపోవుటకు కారణమగుచున్నది.

కాబట్టి లోకంబున నిట్టియజ్ఞానము నివర్తించుటకు :—బ్రహ్మ విద్యయను మహారణ్యమును భేదించిన జీవన్ముక్తియను మహాఫల మొక్కటిన్ని ఆజీవన్ముక్తి యనుభవమంతయును విచారించిన జీవుడు దేవుడైన క్రియ యొక్కటిన్ని తెలినందున లోకంబున బ్రహ్మవిద్య యెంత కష్టముగా గనుపించుచున్నదో దానియందుగల మోక్షమంత సులభముగా నున్నదని సర్వత్రా యేకరీతిని దెలియుటకై బ్రహ్మవిద్యయందలి సారాంశమైన జీవేశ్వరుల నిద్దరినిమాత్రము పట్టుకొని సద్యోముక్తి సోపానవగణంబైన సహజామనస్క రాజయోగ మార్గము సమగ్రకముగా వివరింపబడుచున్నది.

అదియెట్లనగా లోకంబున జీవన్ముక్తికొరకు మంత్రలయ హఠ రాజయోగములని నాలుగు ముఖ్య సాధనము లేర్పడియున్నవి. అందు మంత్రలయ హఠ యోగంబులు క్రమముక్తి సాధనంబులగుటవలన అది పిపీలికా మార్గమనిన్ని రాజయోగమొక్కటి సద్యోముక్తి సాధనముగనుక అది విహంగ మార్గమనిన్ని చెప్పబడుచున్నది. గనుక లోకంబున సతీపతులు బ్రహ్మవిద్యా సాంప్రదాయకమైన విహంగ రాజయోగము నభ్యసించి బ్రహ్మాత్మైకత్వ విదేహ కైవల్యమును పొందుదురుగాక.



# రాజయోగము.

రాజయోగ మనగా, బ్రహ్మ విద్యయను కల్పవృక్షముయొక్క అగ్రభాగమందున్న కైవల్యఫలముకై చీమవలె చెట్టుచుట్టు తిరిగి తిరిగి

చిక్కులుబడునదిగాక పత్నీవశలియెగిరిఫలమునుగ్ర హించునది గనుకవిహంగమార్గమని చెప్పబడు చున్నది. ఇట్టిరాజయోగమునకు సాంఖ్యతారక అమనస్కములనే మూడంగములు గలవు. అందు జీవేశ్వరులను విమర్శించునది సాంఖ్య యోగ మనిన్ని, జీవుడు దేవుని దర్శించునది తారకయో గమనిన్ని, జీవుడు దేవుడై ప్రకాశించునది అమ నస్కయోగమనిన్ని చెప్పబడుచున్నది గనుక ముందు సాంఖ్యయోగము వివరింపబడుచున్నది.



## సాంఖ్యయోగము.

క॥ జీవుని దెలసినదనుకను। దేవునిభ్రమబాదలు నరుడు దేవుడుదలపక । జీవుండని వివరించిన । భావంబునముక్తి బట్టబయలుర వేమా ॥ అన్న ట్లు యీదేహస్థుండైన జీవుండు తనస్వరూపము తనకు తెలిసేవరకున్ను దేవు డెట్టివాడో యని

భ్రమించుచుండును. తనమూలముతనకు తెలియ బడినపుడు తానే దేవుడై ప్రకాశించు చుండును గనుక జీవేశ్వరులను బాహ్య ప్రపంచమందు విచారించునది బహిస్సాంఖ్య మనిన్ని తన దేహములోపల విచారించునది అంతస్సాంఖ్య మనిన్ని చెప్పబడుచున్నది.

బాహ్యవిచారణ :—దేవుడున్నాడా ? లేడా ? ఉండినయడల దేవుడెట్టివాడు ? జీవు డెట్టివాడు ? జగత్కర్తయైన దేవుండు సూత్రధారియై యుండు టచేతనే దేహధారియైనజీవుండు నటించుచున్నా డుగాని సూత్రధారి లేకుండిన దేహధారి నిలువ జాలడు. కల్పితుడైన జీవుడు తానుండినప్పుడు కర్తయైన దేవుడు కలడాయని సంశయింపబని లేదు. గనుక దేవుడనగా:—ఆస్తికబుద్ధిగలిగితన్ను నమ్మినవానిని రక్షించు వాడున్ను నాస్తికులై దేవుడు లేడని నిరసించువారిని తప్పక శిక్షించువా డున్ను అగును. అట్టిభగవంతుండు విశ్వమయుడై

బ్రహ్మాండమంతటను వ్యాపించుటవలన దేవుడు మహాకాశము వంటివాడనిన్ని, భగవత్కల్పితు డైన జీవుండు దేహరూపుడయి దేహమంతటను వ్యాపించుటవలన జీవుడు ఘటాకాశమువంటి వాడనిన్ని, దేవుడు సర్వసాక్షి యయి ప్రకాశిం చుటవలన సూర్యునివంటి వాడనిన్ని, జీవుడు చిదాభాసు డయినందున ప్రతిబింబము వంటి వాడనిన్ని, దేవుడుఆనందస్వరూపుండయి చెలిం ప కుండుటవలన మహాసముద్రము వంటివాడ నిన్ని, జీవుడు దేహధారియై చెలించుచుండుట వలన జలబుద్బుదమువంటి వాడనిన్ని యిటువ లెనే దేవుడు స్వతంత్రుడనిన్ని జీవుడస్వతంత్రు డనిన్ని దేవుడు సర్వజ్ఞుడనిన్ని జీవుడు కించిజ్ఞుడ నిన్ని జీవునకున్ను దేవునకున్ను గల స్వరూప భేదమును గ్రహించునది.

అంతర్విచారణ:—గీ॥ ఒక్కయుక్తిలోన ను న్నదితత్వంబు।పట్టిచనువుపోరు వెట్టిగాచె। నేను

నేనటంచు నెరసిన తెలియుడా । తానుగాక వేరె తానుగలడె ॥ అన్నట్లు మనదేహమందు నేనను వాడెవడనివిచారించిన జీవునకున్ను దేవునకున్ను గలయేకత్వము దెలియబడుచున్నది గనుక నేన నుశబ్దమునుబట్టి విచారింతము నేననుశబ్దమెక్క డనుండి వచ్చుచున్నది ? నేననుశబ్దము వాగింద్రి యముగుండా బైలుపడుచున్నదిగనుక అదివైఖరీ వాక్కనిన్ని, ఆవాగింద్రియము ప్రాణవాయు సత్తావలన బలుకుచున్నది గనుక అదిమధ్యమ వాక్కనిన్ని, ఆప్రాణ వాయువు మనస్సంకల్ప శక్తిచే చెలించుచున్నదిగనుక అది పశ్యంతి వాక్కనిన్ని ఆమనస్సంకల్పము ఆత్మసత్తావలన జనించుచున్నది గనుక అది పరావాక్కనిన్ని చెప్పబడుచున్నది. ఇట్లు పరా పశ్యంతి మధ్య మా వయిఖరీ వాక్కులకు అధిష్ఠానమయి యున్న ఆత్మవస్తువు దేనివలనను బుట్టినదిగానం దున నేననువాడు స్వయంభువైన దేవుడేగాని

దేవునికంటె అన్యుడుకాడని యీ అంతర్విచా రణవలన స్పష్టమగుచున్నది. కాబట్టి లోకంబు ప సతీపతులు తమదేహములో నిట్లువిమర్శించి జీవేశ్వరైక్య జ్ఞానమును గ్రహింతురుగాక.

## తారకయోగము.

సీ॥ అల యవస్థాత్రయములదాటి మదిలోన రజతాద్రి పటికంపు రాతిపైని । నిండువున్న మనాటి పండువెన్నెలవలె పట్టపగలిటి బట్టబ యలుబోతె । నిండిపండినరీతి నిబిడీకృతానంద మైవెల్గుతుర్య సమాధియందు । చిన్మయజ్ఞప్తి మై సన్మాత్రమాత్రమై శేషించు నదిదాన జెలగుచున్న । బ్రహ్మవిద్యా దురంధరుల్ బాహ్యమందు । జాతి వర్ణాశ్రమాచార సంస్కృ తులను । సన్యసింపైన సంసారసంగులైన । యఖి లవ్యవహార్తలై యెందునంటనధిపా ॥ అన్నట్లుదే హాధారియైన జీవుండు తంతుకీటకంబూర్ధ్వగతం

బై స్వాంతర సూత్రింబున స్వస్థానంబు జేరున ట్లు, జాగ్రత్స్వప్నసుషుప్తులగు మాయావరణం బులనతిక్రమించి తురీయంబైన బ్రహ్మస్థానంబు ప్రవేశించి ఆత్మేశ్వరుండైన దేవుని తానుగా దర్శించి అఖండసచ్చిదానంద స్వరూపంబుతానై జీవేశ్వరైక్యం బనుభవించునదియే తారకయోగ మని చెప్పబడుచున్నది.

కాబట్టి "అద్దమునందు మనుష్యుడు నిజాస్య ముదా గనుగొన్నమాడ్కి లోనిద్దవుదృష్టిజూడ గ వినిర్మలబ్రహ్మము గానవచ్చు" అన్నట్లు అవ్యక్తమహదహంకారస్వరూపుండైన జీవుండు యేనిశ్శబ్దబ్రహ్మమైన దేవునిలోనుండి పరాప శ్యంతిమధ్యమావైఖరీ వాక్కులద్వారా వెలువె డలి శబ్దబ్రహ్మమై నేను నాది యని వ్యవహ రించుచున్నాడో అట్టి శబ్దరూపమైన మిథ్యా హంకారమును ప్రాణమందును అట్టిప్రాణమును సంకల్పరూపమయిన మనస్సునందును అట్టిమన

స్సును అధిష్ఠానమయిన ఆత్మయందును క్రమం బున నైక్యంబునొందించి “ నిత్యానందతురీయే విగత కలిమల స్సర్వసాక్షీశివోఽహమ్ ” అను న్యాయంబున అవస్థాత్రయాతీతుండైన ఆత్మే శ్వరుండు తానే ఆహా ! ఇట్టి తారకయోగానుభ వంబువలన జీవుండైననేను దేవుండనై ప్రకాశిం చుట యెంతవిచిత్రముగా నున్నది ! ఇక నాకు జనన మరణ భయము గలుగ నేరదు. నేనే దేవుండను, నేనే పరంజ్యోతిని. నేనే పరబ్రహ్మ మును. అని యిట్లు తన్ను తాను జూచుకొని తన లో తానే యానందించుచు, మరల యథాప్రకా రంబున నాతురీయ సమాధినుండి శబ్దరూపంబున జీవుండై బైలుపడుచున్నాడు. కాబట్టి లోకం బున సతీపతులు యిట్టి తారక యోగమును సద్గురుమూలంబుగా నభ్యసించి తమలోనున్న దేవుని దర్శించి జీవన్ముక్తి సుఖం బనుభ వింతురుగాక.

# అమనస్కయోగము.



శ్లో॥ సంకల్పమాత్రకలనేవ జగత్సమగ్రం। సంకల్పమాత్రకలనేవ జగద్విలాసః। సంకల్పమాత్రమిదముత్సృజ నిర్వికల్ప। మాశ్రిత్యమామకపదం। హృదిభావయస్వ॥ అనగా సర్వప్రపంచమున్ను మనస్సంకల్పమందే జనించి సర్వవ్యాపారమును మనస్సంకల్పమువలననే జరుగుచున్నది గనుక నీమనస్సంకల్పము నింతటితో విసర్జించి సర్వసంకల్ప రహితుండవై కేవల నిర్వికల్పంబయిన బ్రహ్మము నీవుగా భావించి నాయొక్క కైవల్యపదము నాశ్రయింపుమని పరమాత్ముండయిన సద్గురువు జీవాత్ముండయిన సచ్ఛిష్యున కుపదేశించుచున్నాడు. కాబట్టి ముముక్షుండయిన జీవుండు, సద్గురూపదిష్టంబగు నీయాత్మజ్ఞానంబు వలన సంకల్ప రహితుండై దేవుండుతాననే జ్ఞానంబు మరువక తటస్థుండై

వర్తించునదే అమనస్క యోగమని చెప్ప బడుచున్నది, అయితే దేహమందు జీవుడుండగా మనస్సున్ను మనస్సుండగా సంకల్పమున్ను నశించదుకదా, బ్రహ్మవేత్తలు సంకల్పరహితులై యెట్లువర్తింతురని శంకించిన శ్లో॥ కృష్ణ భోగీ శుకత్యాగీ । నృపౌజనక రాఘవః । వశిష్ఠః కర్మనిరతో వంచైతే జ్ఞానసత్తమః ॥ అనునట్లు కొందరు జ్ఞానులు సంసారమందనురక్తులై యుండినను కొందరు విరక్తులై యుండినను అశరీరమయిన బ్రహ్మము తామగుటవలనవారికి శరీరేంద్రియంబు లుండినను వారే విదేహులని న్ని సంకల్ప వికల్పంబులు గలిగియుండినను సాక్షియయిన బ్రహ్మము తామగుటవలన వారే అమనస్కులనిన్ని చెప్పబడు చున్నారు, అందువలన సంకల్పరహితులనగా దేవుడయిన ఆత్మయందు మాయమైన సంకల్పముబుట్టి తాను జీవుండని భ్రమించునది మనస్సుయొక్క దృఢ

సంకల్పమేగదా ; అట్లుతానే జీవుండని బంధము లోజిక్కిన మనస్సు తాను దేవుండనే దృఢసంక ల్పముచే బంధమునుండి విడువ బడుచున్నది. కనుక సంకల్ప మూలమయిన జీవభ్రాన్తిని ఆత్మ జ్ఞానంబున తొలగించునదియే సంకల్పరహితము గాని సుషుప్తివలె మనశ్శూన్యమై జడత్వము నొందునదికాదు. కనుక సంకల్పరహితు లైన రాజయోగులు గీ॥ చూడకేచూచు జగమెల్ల చోద్యమంద । చావకేచచ్చు నత్యంత సరసలీల। చేయకేచేయు క్రియలెల్ల సిద్ధయోగి ॥ అన్నట్లు వ్యవహార సమాధులు రెంటికిని భంగములే కుండ యేకత్వజ్ఞానముతో ప్రవర్తించుటవలన అది సహజామనస్క రాజయోగమని చెప్పబ డుచున్నది.

అట్టిరాజయోగుల స్వానుభవ మెట్టిదనగా గీ॥ ఎరుకకన్నసుఖము యేలోకమున లేదు । మఱుక నెరుగనెవని కెఱుక లేదు । మెఱుకసాటి

మొరుక మెరుకయే తత్వంబు ॥ అన్నట్లు మెరు
కనగా జ్ఞానము. జ్ఞానముచేతనే సకలకార్యము
లును చేయబడుచున్నవి. జ్ఞానముచేతనే సకల
సుఖములును పొందబడుచున్నవి గాని జ్ఞానమ
ను వస్తువు నెట్టిదో జీవులకు దెలియబడుట
లేదు. మెరుకలేనివాని కేగతియును లేదు.
యదార్థము విచారించిన జ్ఞానమను వస్తువు
మాయాకల్పిత వస్తువులకంటె విలక్షణమై విజా
తీయమై, స్వయంభువై, స్వప్రకాశమై, అఖండ
మై, అద్వితీయమై యున్నది.

"శ్రు॥ ప్రజ్ఞానంబ్రహ్మ" అను వేద ప్రమాణం
బున జ్ఞానమే బ్రహ్మము, బ్రహ్మమేఆత్మ, ఆత్మ
యే తెలివి, తెలివియే దేవుడు, తెలివియే బ్ర
హ్మ, తెలివియే విష్ణువు, తెలివియేరుద్రుడు, తె
లివియేయింద్రుడు, తెలివియే సురలు, తెలివియే
నరులు గనుక సకలజీవ చేతనములును తెలివి
చేతనే యేర్పడినవిగాని తెలివిలేని చేతనమొక్క-

టియును లేదు. ఇట్లు సర్వ భూతంబులయం దంతరాత్మయై ప్రకాశించుచున్న ప్రజ్ఞానమే బ్రహ్మమైనందున ప్రజ్ఞాన స్వరూపుండైన దేవుండు తానని శ్రుతి గురుస్వానుభవంబులచే గ్రహించిన జీవుండు, తన్నుదా నవలోకించి అఖండసచ్చిదానంద పరబ్రహ్మము నేనుగాని అనాదిమూల ప్రకృతియైన మాయను నేను గాను; అకల్పిత స్వయంజ్యోతి స్వరూపుండను నేనుగాని మాయాకల్పిత దేహస్వరూపుండను నేనుగాను; ప్రజ్ఞానస్వరూపుండైన దేవుండను నేనుగాని అజ్ఞాన స్వరూపుండయిన జీవుండను నేనుగాను; అనియిట్లు స్వస్వరూప జ్ఞానంబున తానుదేవుండై ప్రకాశించుచు తానేతానై యా నందించుచు దేవుడుతాననే యెరుకను మఱవక తనలో తానే తృప్తినొందుచు విదేహకైవల్యసుఖం బనుభవించుచున్నాడు.

-ఈసహజామనస్క రాజయోగమునుగురించి విదేహకైవల్యమును గ్రంథమునందువిపులముగా వ్రాయబడియున్నందున యీగ్రంథము నింతటితో ముగించడమైనది.

కాబట్టి లోకంబున సతీపతులు సహజామనస్క రాజయోగానుభవంబును సద్గురుకటాక్షంబువలనన్ గ్రహించి పరమేశ్వరానుగ్రహంబువలన విదేహ కైవల్యసుఖం బనుభవింతురుగాక. ఇదిసనాతన సహజాద్వైత బ్రహ్మవిద్యాసాంప్రదాయమని గ్రహింతురుగాక.

సతీపతిహితోపదేశం సంపూర్ణమ్.

—గద్యము.—

ఇది శ్రీనృశింహ సద్గురు పరమేశ్వర కరుణా
కటాక్షలబ్ధ విదేహ కయివల్యానుభవ
గవర్రాజు వంశపవిత్ర అత్రేయసగోత్ర
శ్రీలక్ష్మణామాత్యపుత్ర సూర్య
నారాయణశర్మణా విరచిత
సతీపతిహితోపదేశగ్రంథ
స్సమాప్తః.



# సరస్వతి.

---

ఇది యొక మొదటి తరగతి తెలుగు మాసపత్రిక. ఇది 13 సంవత్సరములనుండి యవిచ్ఛిన్నముగాఁ గాకినాడలోఁ బ్రచురింపఁబడుచున్నది. ఇందు రమారమి ప్రాచీనపద్యకావ్యములుగాని నవీన కవికృత నాటకములునుగాని నవలలుగాని 80 కి తక్కువ ప్రకటింపఁలేదు. మఱియుఁ బ్రాచీనగ్రంథములు కవుల చరిత్ర సైతమెఱుఁగనివి యిందుఁ బ్రకటించుచున్నాము. తెలుగు మాసపత్రికలలో నింతకంటె [illegible]యగునది లేదని మేము వేఱే ప్రకటింపనక్కఱలేదు. [illegible]చందా సంవత్సరమునకు రు 3-0-0. స్త్రీలకు విద్యార్థులకు రు 2-0-0 మాత్రమె చందా ముందుపంపించవలెను. లేదా చందాదారులకు మొదటి పత్రికయె వి. పీ. గా పంపఁబడును.

కావలసినవారు

సరస్వతీప్రెస్సు, కాకినాడ

అని వ్రాసినఁ బడయఁగలరు.

